సరస్వతీ గ్రంధమండలి

# అన్నీ తగాదాలే

భమిడిపాటి కామేశ్వరరావు

షర్సు: అద్దేపల్లి అండ్ కో
స్వాతీ పవర్ ప్రెస్
మహేంద్రవరము

# అన్నీ తగాదాలే

భమిడిపాటి కామేశ్వరరావు

తెలుగు-వ్యాకరణం; పద్యం-రాగం; పద్యం-అర్థం; వేషం
తుక్కు-ముక్కల హక్కు-చిక్కు

**1-౫0**

పబ్లిషర్సు : అద్దేపల్లి అండ్ కో
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము

# హెచ్చరిక

కేవల వినోదం నిమిత్తమైనాసరే, లేక సొమ్ము వసూలు చేసుకునే నిమిత్తమైనాసరే, ఈ ప్రదర్శనాలలో ఎక్కడైనా సభఎదట ఆడదలచిన ప్రతి సంఘం వారున్నూ, ముందుగానే, గ్రంథ కర్తకి వ్రాసి లిఖితానుమతి పొందక పోవడం కాపీరైట్ చట్ట ప్రకారం ఒక నేరం గనక, ఆసంగతి గమనించి లిఖితానుమతి పొంది తరవాతనే ఆడుకోవాలి.

భమిడిపాటి కామేశ్వరరావు
రాజమండ్రి

# ఉపోద్ఘాతము

ఇది నాలుగు తగాదాల గురించిన వాదోపవాదములుగా గలది. 2 — 9 — 24 తేదీని, మెట్కాఫ్ వసతిగృహ వార్షికోత్సవ సందర్భంలో మ. రా. శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహరావుపంతులుగారి అధ్యక్షతక్రింద రాజమండ్రి ఆర్ట్సు కాలేజీలో జరిగిన సమావేశంలో, ఇది ప్రదర్శించడం అయింది.

ఇందులో, పాలగుమ్మి వీరభద్రేశ్వరరావుగారు, బోడపాటి రాజగోపాలరావుగారు, రావూరి చిట్టిసుబ్రహ్మణ్యంగారు, దొడ్డిపట్ల కామేశ్వరరావుగారు, సెక్రటరీ గవరరాజుగారు, మరి కొందరూ పాల్గొన్నారు.

# అన్నీ తగాదాలే

---

## తెలుగు - వ్యాకరణం

(రత్నశాస్త్రి యిల్లు. ఒకప్రక్క కృష్ణాజినం, రాగిచెంబు వగైరా. మరొకవేపున తాళపత్రగ్రంధాలు. ఒకగ్రంథం చదవడం అప్పుడే ముగించి, శాస్త్రిగారు ఆలోచనలో పడతాడు.)

శాస్త్రి—(తనలో) ఏముంది! వెనకటికాలంకాదు వెనకటి కథ గాదు. రోగాలకి మాత్రలు లేవు ఇప్పుడు. గజ్జికురు వేసినా సరే, ప్రతీవాడూ సీసా చీటీ పుచ్చుకుని బయల్దేరుతాడు. తగాదాలు పైసలు చేసుకునే వాళ్ళు లేరు; ప్రతివాడూ వకాల్తీ, దావా, డామేజీ అనేవాడే గాని చక్కువుల్లో అమరం వల్లెవేసే చవట ఎవ్వడూ కనపడ్డు, ప్రతివాడూ బి.ఎ.డి., యమ్.ఎ.డి. అంటూ యింగిలీషు. పోనీ పాఠాల పుస్తకాలు చూద్దాం అంటే, "మంగలి తలగొరుగును" అంటూ మొదట్లోనే కుర్రాడికి వపనక్రియ బోధిస్తాయి. శరీరానికి బలంగాని, మనస్సుకి వికాసంగాని, ఆత్మకి శక్తిగాని వెనకటికి మల్లే లేవు. కూరలూ అవీ వెనకే బాగుండేవి. గాళ్ళుపుఱు వెనకేసినవే గొప్పవి. అప్పటి వర్షాలే వర్షాలు. పూర్వపు దీపావళి పండుగలాంటిది ఇటీవల ఒక్కటీ రాలేదు. వెనక చెడుగుడి ఎల్లా ఆడేవారూ! వెనక ఒక్కొక్కడికి ఎన్నెన్ని తెలివితేటలుండేవి! వెనకటి వాళ్ళు తిన్నట్టు ఇప్ప

టి రకాలు తినలేరు. వాళ్ళకి మల్లే నడవలేరు, కష్టపడలేరు, ఆ మాటకొస్తే ఏమీకూడా చెయ్యలేరు. ఆ తిండీ ఆ తిప్పలూ వెళ్ళాయి, ఆ తెలివీ అ తేటా నడిచాయి, ఆ నీతి ఆ జాతీ చచ్చాయి! యుగధర్మం! ఒకర్ననవలసిన పనేమిటి! అంతా యిల్లా పాడైపోతుందని పురాణాల్లో స్పష్టంగా వివరంగా రాసేశారు. ఆ రాతప్రకారం జరక్కుండా బ్రహ్మరుద్రులు చేయగల్రా? అయ్యో! అద్భుతమైన గడ్డీ కరిచి, సకలమైన అనుభవములున్నా అయిన మీదట తాము గ్రహించగలిగిన జీవిత విజ్ఞానాంతరాలయొక్క రహస్యాలు ఇమిడిఉన్న జ్ఞానవిజ్ఞానాల్ని, అజ్ఞానులైన ఇప్పటివారికి శాశ్వతంగా ఆ దేవభాషలో పూర్వులు ఇచ్చిపోలేదూ! వాళ్ళకావ్యాలు ఇప్పటివారు చూడరుగదా! చదవరుగదా! చదవలేరుగదా! వినరుగదా! కనలేరుగదా! తప్పనిసరిగా వీళ్ళచేత చదివించే విద్యావిధానమేనా లేదుగదా! ఆ నాగరవాక్యాగరం చాలావరకు, నాటకాలంకారాలూ, గణితతర్కాలూ, నిఘంటు వైద్యాలూ కూడా, పద్యమయం గదా! అందు విస్తరింపబడని జ్ఞానభాగమున్నా ముచ్చటింపబడని విషయమున్నా ఉండబోవుగదా! వల్లనూ లినన్ని శాస్త్రాలూ విద్యలూ చెరుకుపానకంవంటి ఆ సంస్కృతంలో చిరస్థాయిగా ఆకారం దాల్చి ఉంటూండగా, ఏదో తెలుగంటూ దేవుళ్ళాడతారు కొందరూ! తెలుగులో ఏముందీ? మృత్తిక! తెలుగు వొత్తిపిప్పి, తేలిక– సంస్కృతంయొక్క బరువులో నాలుగోవంతేనా ఉండదు. అందుకనే నేను తెలుగు

పుస్తకం అనేది ఇల్లా చూడలేదు, ఎన్నడూ చూడను. ఇందులో "బాగున్నా" యంటూన్న గ్రంథాలు, పూర్ణంగా తల్లిభాషలోని కావ్యనాటకాలంకారాలు జిహ్వాగ్రమం దున్నవారివే. తెలుగులో ఉన్న జీవం అంతా ఆ సంస్కృతాందే! తెలుగు రచనలో హాయిగా ఉండేపట్టులని జనం మెచ్చుకొని రొట్టెలు వేస్తూండే ఘట్టాలన్నీ, ఆ సంస్కృత సమాసాలు జటిలంగా ఉన్నవే. కాని, ఆరోజుకారోజు అన్నిటితోపాటు భాషకూడా తగులడి పోతోంది. ప్రతీవాడూ భాషతో కలగచేసుగోడమే. ఈ అచ్చురావడం మరీ పుట్టిమునక అయిపోయింది! ప్రతీవాడూ కవే! పాండిత్యం లేదు, ప్రకృతలకాయూ లేదు! పాండిత్యం అంటే సంస్కృతంలో అన్నమాట, కడంవి పాండిత్యాలే కావు! ఒక పత్రిక తాలూకు స్వకీయ విలేఖరి ఒక ఆయన్ని ఎవర్నైనా వట్టుకొని పత్రికలో "పండితుడు" అని అచ్చు కొట్టిస్తే, ఆయన ఆక్షణాన్నించి పండితుడుగా మారిపోనా! "తెలుగు పండితుడు" అంటూంటారు, వారు నిజంగా, ఏ కొంతవరకో, సంస్కృతపండితులే. తెలుగులో—అసలు తెలుగేదీ పాండిత్యానికి! ఆవశంగా, ఏదోరాశాం అంటూండడం, హైనరమజ్జా అని అచ్చుపడుతూండడం! అచ్చుకి ఒం పేటప్పుడు, రచన, కాకితానికి ఒకవేపునే వ్రాయాలట. కాని, కొందరు పత్రికలు నడిపేవారు, ఒకవేపునరాసి ఉన్నదైతే చాలు, ఏమిటైనాసరే, అచ్చుకొట్టి పారేస్తారు! ఇక నెన్ని చిత్రాలు! కవిత్వం లేకుండానాటకాలుట, సంగీతంలేకుండా పద్యంట, పద్యంఛందస్సూ లేకుండా కవిత్వంట,

అర్థం తెలియకుండా కవిత్వంట! అయ్యొయ్యో! ఏంచెప్పను! కా ల్నుగు తినేస్తున్నారు, వీళ్ళ మొహం తీర్థాసికెళ్ళా! తెలుగువాణ్ణి యంట, దానికి కొన్ని కొత్తకొత్త అలంకారాలుట. అందు లో నవలట—చెవలన్నట్టు! గాల్లో చక్కని కల్పన లుంటా యిట, వేడివేడివి ఇప్పటి కారువాళ్ళు, వీళ్ళు ఏం కల్పించి ఏ డవగల్రు వీళ్ళపిండాకుడూ నా శా్రివ్యాణార్థమూనా! ఇదివరకే సర్వమూ వ్రాయబడి చక్కగా సంస్కృతంలో ఉంటూంటే ఇహేముంది వాృయడా.కీ! మళ్ళీ వీళ్ళువదో రాస్తూండడం ఎందుకో నాకు బోధపడలేదు. కొందరు ఆ దివ్యభాషలోంచి తర్జుమా చేశాం అంటూంటారు, పద్యానికి పద్యం, వచనానికి వచనం, ఫులిస్టాపుకి ఫులిస్టాపూను ! చ స్తే చెయ్యలేగు. ఆ సార స్యం చచ్చిపోదుమయినా రాదు. తెలుగు ముక్కలు రాని స్తే. సంస్కృశంలోఉండే మజాకా అంతా పూర్తిగా దిగదుట, అం దుచేత. కొందరు అసలులో సమాసాలు అట్లానే ఉంచి డు, ము, వు, లు లాంటివి చివళ్ళకి తొడిగి తెలుగని పారేస్తారు అది పద్యం కాకుండా వచనం కాకుండా, తెలుగు కాకుండా సంస్కృతం కాకుండా పలుకుఅన్నంలాగ పరిణమిస్తూంటుంది. పోనీ నిజంగా కొత్తవైతే ఊరుకోవచ్చు—కొన్ని కొత్తవి లాం టివి గోకేవాళ్ళున్నా, వ్యాకరణం చూట్టం లేదు వీళ్ళ మొహం యీడ్చా! ఆ నన్నయా, అధర్వణుడూ, వాళ్ళూ, ఆ తెలుగువ్యా కరణాన్ని సుబ్బరంగా నాగరంలో వ్రాసిపోలే, తెలుగులో రా స్తే ఆట్టే విలవుండదనీ ! సంస్కృతపాృకృతాలకూ, వేదాధ్య

యనాదులకూ ఖనిమైె ఒప్పినటువంటి ఆయొక్క నన్నయ్య భట్టు ఆదిని వ్రాసిన చింతామణి మింగిస్నీ, మరియితరమైనవి గ్రోలిస్నీ, పైడిపాటి, అడిదం, కస్తూరి, గణపవరపు వారల నిఘంటువులు తినేసిస్నీ కాకపోతే, తెలుగులో అసలు 'కవి' అనేవాడు జనించి ఉండునా? (కుడి పక్కకి చూచి) ఎవరో వస్తున్నారు !

(సభాపతి వస్తాడు)

సభాపతిలా ఊరుకొన్నాడు, సభాపతేనా ఏమిటి? సభాపతే! సరే, గడ్డం పెంచడమైంది, పెదవికింద కొంత ఉంచడమైంది, దొరవేషమైంది, ఇప్పుడు మళ్ళీ ఇదొహవేషంలోకి దిగావు! ఇతర హిందువుణ్ణి ఎవర్నైనా వీడు అరవ, వీడు పంజాబీ, వీడు బంగాళీబాబు. అని ఆనవాలు పట్టచ్చును కాని, మన తెలుగు ఆసామీని చూచి పోల్చడానికి కొంతబుద్ధి ప్రయోగిస్తేగాని లాభంలేదు. తెలుగులో నూటికి తొంభైతొమ్మిది అనుకరణం. ఒకడు బియ్యంమరెడితే అంతా ఆమరే; ఒకడు మోటారుకారు వేస్తే, అంతా ఆ కారే; ఒకడు దివాలాతీస్తే, అంతాఅదే. దండకారణ్యానికి దగ్గిరవడంచేత రామసైన్యపు లక్షణం సంక్రమించి ఉంటుంది. ఈమాత్రం ఆలోచించలేరు, ఏమన్నా అంటే ప్రతీదానికీ "ఎందుకూ? ఎందుకూ?" అంటూ నిశింపాగా కారణా లడుగుతారు. అయినా గానీ, నాకెందుకులే, నీవేషం జోలి! నీకా బాల్యపు తిక్క వదిత్తే నువ్వే తిన్న పడతావు! వేషాని కేమీ అనలేదు. కాని, భాష పాడుచెయ్యడానికి

బయలు దేరావు టేమిటి నువ్వుకూడాను !

స - మీ " ట " కారప్రయోగాన్ని బట్టి, మీరు ఏదో మో_స్తరుగా విన్నారని తెలియబడుతోంది. ఈ భాషావ్యవహారం స్థిరపరచడానికి రాసి ఉన్నదాల్లో లేశమైనా మీ రెరుగరు. ఎరిగిఉంటే, పాడుచెయ్యడం పుణ్యం ఎవరు కట్టుకున్నారో గ్రహించి మరీ మాట్లాడి ఉందురు !

శా - సరిపోయింది ? ధ్వంసం చెయ్యడం మొదలెట్టింది నువ్వా! ఆ మాట నిన్ను అని పోతారని, ఇతరులమీద ఆ అక్షతలు ముందే వేస్తున్నావ్ ? అయితేనూ, పండితుల్ని పట్టుకొని దులుపుతున్నావు టేమిటి, మొహంఎదటే, ఏమీ అట్టే పెట్ట కుండాను !

స - అందుకనే మీరు సత్యంచూడకుండా అభిప్రాయా లిస్తున్నారని చెప్పింది ! అసలు ముందు "పండితుడు" అంటే ఏమిటో నిర్వచించి, ఆతరవాత మరేమన్నా కాసెండి. పండి తుడికి నేను దాసోహం చేస్తాను.

శా - ఓహోహో ! మతిగానీ పోతోందావమిటి నీకు. సభాపతీ ! ప్రతీదానికీ నిర్వచనం అంటూ కూచుంటే ఎల్లా ఏడుస్తుందీ ? పదాలయొక్క నిర్వచనాలు ఆయాశాస్త్ర సంద ర్భాల్నిబట్టి ఉంటాయి,పిరాయిస్తాయి. గోరంతలు కొండంతలు చెయ్యరాదు. మా మూలుగా "పండితులు" అని మనం ఎవర్ని అంటామో నీకు తెలియనే తెలియదూ ? అధమం సంస్కృ తంలో పంచ........

స - తెలుగులో మాట నే అడుగుతూన్నది !

శా - తెలుగులో మాటే నే చెబుతూన్నది! ముందు సంస్కృతంలో పంచ......

స - అక్కడికి ఆ పంచశిఖలూ ఎవరేనా తెలుగులో ధరిస్తే చాలదూ, ఆ ఒకర్ని తెలుగు పండితుడు అనడానికి ?

శా - ఎడిసినట్టేఉంది, ఏడుపు. ముందు దేవభాషలో కావ్యాలు చదివి, శాస్త్రినా వ్యాకరణం, అలంకారం గాలించి, నాటకాంతం చూచి, అప్పుడు తెలుగులో పంచ......

స - మీరు చెప్పేది సంస్కృతాభ్యాసానికి. పైగా, అన్నింటికీ శిఖరప్రాయంగా ఆ నాటకాలు ఉద్భవించడం చేత నన్నా, ఆనాటకాలు రాసినవాళ్లు తర్క-వ్యాకరణాలంకారాదులలో మునిగి తేలి ఉన్న వాళ్ళవడం చేతనున్నా, చదివే వాడుకూడా ఆక్రమాన్నే చదువుకోవాలి. కాని, తెలుగులో నాటకాంతం అన్నా నాటకప్రారంభం అన్నా విశేషం తేడా ఉండదు. మనం మాట్లాడేది ఆ చదువుకోడం ప్రశంసకాదుగా ?

శా - బాగానేవచ్చింది, నీలాంటి కుతర్కం! నీతో మాట్లాడ భయం, ఎకటపడ భయం. నీకు ప్రతీదీ తప్పే! అల్లాయితే పంచ ...

స - ఉండవయ్యా, పంచాలేదు, ఉత్తరీయంలేదూ ! అదా ! తప్పులు కనపరచడమా నీకు కోపంవస్తే! ఉన్నదిఉన్నట్టు చెప్పడమేనా, నువ్వింటాకా తిట్టడమన్నావ్ ! తప్పు అనేమాట నిర్వచించు. భాషలో తప్పు ఒప్పు నిర్ధరించగలవాడెవడు ?

"ఇతరులంతా తప్పులుపట్టుకునేవాళ్ళేను" అనుకునే వాళ్లా పండితులు !

శా - అదికాదు ! ఇల్లా లెక్కపెట్టి మాటల్లో తప్పులు ఏకరువుపెట్టడంలో నీ అభిప్రాయం ఏమిటి ? ఎన్నితే ఎవరి కుండవు ? ఆ యెన్నిక ఏమి అక్కరకు వచ్చేపని ? "ఏకోహిదోషో గుణసన్నిపాతే" అనిలేదూ ! "ప్రబంధము నా జలరాశి, దాని లోపలగల నెరసుల్ గణింతురె, అపారములౌ మణులుండ్ల, నిల్లగన్" అనిలేదూ ! "కాళిదాస మయూరాది కవులకైన గలవు తప్పులసంగ, నన్యులకులేవె!" అనలేదూ అప్పకవీ ?

స - అదా ! నేను పండితుణ్ణికాను, విద్యార్థిని పదస్వరూపం, పదప్రయోగం, కారకం మొదలుగాగలవి సూత్రానుసారంగా నిర్వహించిన వాడికోసం ఆంధ్రవాఙ్మయం వలలువేసి వెతికి చూస్తున్నాను. ఇంతవరకు ఎవ్వరూ దొరకలేదు. అనుసరిస్తాం అన్నవి అనుసరించకపోవడంవల్ల వారికి పదస్వరూపంలో తప్పులు తప్పులుగా తప్పులు. అవి యేరడంవల్ల తెలుస్తూన్న దేమిటంటే, పాండిత్యం వ్యాకరణం వ్రాయడం ఎడంఅనీ, వ్యాకరణం కవిత్వం వేరనీ, కవిత్వానికీ పాండిత్యానికీ దూరమనీనూ! ఇప్పటి గ్రంథకర్తల్లో ఉన్నారు ఒకటిరెండు పుమ్మరాల్నించి కృషి చేస్తూన్నవాళ్లు. వాళ్ళతప్పులు 'ఏకోహిదోషో' అయితే ఇంకేం. నిక్షేపంలాగ ఎల్లానో అల్లా ఏకుద్దాం, వేనవేలుగా ఉన్నాయి కర్మం. వాటితో మహామహాగ్రంథాలు, మాకు ఆదర్శంగా రాసిపారేశారు. ఆ తప్పులన్నీ వాళ్లు దిద్దుకోడం ఎప్పుడు ? అవి

రాసీకుండా వారు గ్రంధాలు రచించడం ఎప్పుడు? ఇంకా ఇన్నేళ్ళొచ్చి చదువుకోక మున్నాళ్ళొట్టుగోనా, అన్నట్టు! మనల్ని ఒకరు అఖాతంలో దింపుతూంటే, ఆమాట అనుకోడం తప్పా? వాఙ్మయంలో పర్వతాలుంటాయి, అఖాతాలూ ఉంటాయి. పర్వతాలమీదికెళ్ళి ఆనందించడం గురించి పామరులకి చెప్పడం విమర్శించేవాడిపని ఎల్లాగో, అల్లాగే అఖాతాల్లో వాళ్ళు పడిపోకుండా కాపుపెట్టడంకూడా వాడిపనే. తప్పులైతే నేం? పెద్దవాళ్ళతప్పులు గణ్యతలోకి వచ్చి కీర్తి వహిస్తాయి. వాటిని తప్పులుకాకపోతే, పోనీ, విశేషాలనండి. కనక, ఈ గ్రంథకర్తల నెత్తిమీదే ఇన్ని ఎగుడుదిగుడులు ఊరేగుతున్నాయి కాబట్టి, అంతాకూడా, నన్నయ్య వెయ్యేళ్ళకింద రాసిన వ్యాకరణం అవతలెట్టి, ఉపయోగిస్తూన్న భాష పెరుగుతూన్నకొద్దీ గ్రంధస్థం చేస్తే చక్కగా ఉంటుంది.

శా -.(తలగోక్కుని చెయ్యి కడుక్కుని, ఆచమనంచేసి) అయ్యయ్యో, కర్మమా! కలియుగాదిని నన్నయ్య వ్రాసింది కాదంటున్నావు, కళ్ళోతాయయ్యా!

న - ఏమీపోవు! నన్నయ్యే ఇప్పుడుంటే వెనక తను రాసింది కట్టిపెట్టి మరోదస్త్రం తీసి ఉండేవాడు. అంచేత ఇప్పుడు నన్నయ్యావద్దు, మరి చిన్నయ్యావద్దు!

శా - వ్యాకరణం అక్కర్లేకపోతే ఎల్లాగయ్యా ఏడవడం? ప్రతీ వ్యాకరణం రాని చవటాగూడా, వ్యాకరణం వదిలేసి రాశానంటూ బయల్దేరుతాడు, వచ్చి మానేసినట్టూ!

స - బయల్దేరితే ఏం ? మీ కెందుకు కోపం ? జీవభాషంటే మీకంత ఆగ్రహం యెందుకూ? ఎంతమందినేనా రాయనీండి!

శా - మాల మాదిగ అష్టాదశవర్ణాలవాళ్ళనీనా ?

స - ఆ !

శా - ఆ రాతలన్నీ నేను చదవనా ?

స - ఎవరన్నారు ? అవి చదివే వాళ్ళు వాట్లకి ఉంటారు. రాయవద్దని అనడానికి మీ రెవరు ?

శా - నేనా ? పండితుణ్ణి ! నోటికొచ్చినట్టు రాసేవాడికి వాతెట్టిస్తా. ఆ రాత నాశనం చేయిస్తా !

స - రాతల్లో దేశానికి కావలసినవి ఉంటాయి, అనగా మనుష్యులకి. "దేశమంటే మట్టికాదోయ్, దేశమంటే మనుష్యులోయ్ !" అని కవి అన్నాడు. మనుష్యులకి అక్కరలేనివి నశిస్తాయి. కాబట్టి, మీరే బొడ్డున మాణిక్యం పెట్టుగుని పుట్ట లేదు. అందర్నీ ప్రయత్నించనీండి. యత్నానికేం ? మనపై మాటవొచ్చి, జన్మానికి శివరాత్రిలాగ చివరకి ఒక్కమాటైనా సరే ఏదో ఒక సందర్భంలో నేనా 'ఆహా !' అని అనుకోగలిగి ఉన్న వ్యక్తి అయితేం టేచాలు ! రాయచ్చు ! అల్లాచేస్తే, క్రమేపీ, ఈ అపారవాఙ్మయంలో విశేషపరిచయం పదాలతో గలిగిన ఆతను ఒకడు బయలుదేరి, కవిశబ్దం సార్థకం అయి పోయినవారి రచనల్లోఉండే నిత్య ప్రయోగాలు చూసుగుని, వాటి ఆధారంతో లక్షణంగా వ్యాకరణం రాస్తాడు.

శా - అప్పుడెందుకు ఏడవనూ, ప్రతీ పనికిమాలినవాడూ

హద్దులేకుండా పుస్తకాలు రాసి తగులడ్డాక! అది రాయడం పూర్తి అయేటప్పటికి మళ్ళీ కొంత మార్పు మాట్లాడే మాటల్లో కలిసితే- కాకులలెక్కలలాగ- ఆ వ్యాకరణాన్ని బట్టి వ్రాసింది కృతక భాష అయిపోదుమరి! చావొచ్చి పడిందయ్యో, వ్యాకరణం కాదుగాని! అందుకనే దివ్యాంశ సంభూతులైన పాణినీ, పతంజలీ........సరేకాని, వ్యాకరణం ఎందు కంటావ్, అసలూ!

స - వ్యాకరణం ఎందుకంటే, సజీవమైన భాషాస్వరూపాన్ని సమర్థించి, సకారణంగా సోదాహరణంగా నిర్ణయించడానికి; పదాలచరిత్రలో ఉండే మార్పు గ్రహించి, వాటి దారి సూచించ డానికీ; వెనక ఓపడం ఎల్లా ఉండేదో గ్రహించుకోడానికి; అనగా, పూర్వగ్రంథాలు చదువుకోడం వీలుగా ఉండడా నికి; అన్యభాషవాడు ఈభాష నేర్చుకోడానికి;

శా - అల్లాయితే, వైయాకరణి అనకాలంలో ప్రచురమై ఉన్న అడ్డమైనచెత్తా చదవాలనా నీమాట? బాగుంది. జన సామాన్యం మూర్ఖులుగనక, వాడు శాసించి చేసిన వ్యాకర ణప్రకారం వీళ్ళు మాట్లాడడం నేర్చుకోవద్దూ!

స - ఇల్లా అసందర్భంగా భీష్మించుగుని కూచునేవాళ్ళు భాషని తాము పెంచాలేరు. ఇంకొకర్ని పెంచానివ్వరు.

శా - లావైతే సరాయేమిటి, బలుపో వాపో చూసుగో వద్దూ!

స - సజీవమై ఉందో లేదో చూసుగుంటే సరి.....

పెంచలేరు సరిగదా, పండితనామం తమరే జుట్టుకోవాలని వారిఊహ. అందుకనే, అందర్నీ రాయనియ్యద్దంటారు. నూటికి చదువురానివాళ్లు తొంభైపైగా ఉన్నారు. ఇంతమాత్రానికే, ప్రతీవాడూ చదువేనా అని కొందరు గోలెత్తుతున్నారు. ఇల్లా గోలెత్తేవాళ్లు ఇతరభాషల్లో లేకపోవడంవల్లే అవి పెరిగి కొమ్మెక్కాయి.

శా - సరేలెస్తూ! నాకు తెలియదూ ఈమాత్రం! మూలసూత్రాలు వొదిలి లేసపోని పరుగులెత్తమంటావ్? ఏమీ వ్యాకరణం లేకుండా ప్రతీవాడూ రాయవచ్చుననా, నీ వుపదేశం. అహాహా! మానాయ్న! మానాయ్న! అప్పుడు ఒహడి మాట ఒహడికి బోధపడ్డంఎలాగ?

స - అక్కడే ఉంది మీబోట్లనెర్రి! వ్యాకరణాలు ఈరోజున చింపిపారేస్తే, మనకందరికీ, భాష, బోధపడడం మానేస్తుందా? పంచాంగాలుండకపోతే గ్రహణం పట్టడం ఆటంకం పడిపోతుందా? భాషాభివృద్ధి సహజం. ప్రపంచంలో చెవులెట్టుగుని విన్నప్రయోగాలతో, తెలుగు భాషాగ్రంథాలు కళ్ళెట్టుగుని విన్నప్రయోగాలతో, ముందు తనకేమన్నా విశేషభావం ఉండి, అది నాప్రజకి అందిస్తాను అనుకునేవాణ్ణి ప్రతీవాణ్ణీ రాయనీండి మీకు అక్కర్లేకపోతే ఊరుకోండి. ఒకరచన ఊళ్ళో వాళ్ళకి ఎవళ్ళకో తెలియడంలేదేమో అంటూ మీరుపూసుగొని రాకండి, వాళ్ళగుండెలన్నీ మీరుదూరి చూసినట్టు!

శా! అల్లాఅయితే, మనిషికోవ్యాకరణమా?

స - ఎవడేనా అఖండుడై, వాడిఆలోచన జనానికి అవసరమైందయితే, వాడిభాషజనం నేర్చుకోవలసిన పనొచ్చి, వాడి నిమిత్తం ఓవ్యాకరణం లేనదీయవలసివస్తుంది. అల్లా ప్రత్యేకవ్యక్తులకోసం పుట్టిన వ్యాకరణాలు ఇతరభాషల్లో ఉన్నాయి.

శా - ఎన్నటచెప్పు. తప్పులొస్తే రావచ్చు! ఎవరేం జేస్తారు వస్తుంటేనూ? "ప్రమాదో" అన్నారు పెద్దలు. అంతమాత్రాన్ని ఆదర్శం ఎల్లాపోతుందీ?

స - ఆదర్శం అంటే, ప్రపంచంలో లేనిదా? ప్రకృతిసంభవాలకి ఆదర్శం ఏమిటి? ఆదర్శం ఈదర్శమూను!

శా - ఏమైనాసరేగాని, చూట్టాడుతూన్నట్టు ఉంటే మానవులు వింటారు లేకపోతే దేవతలు ఆలకిస్తారు, తీరుబడిచూసుగుని.

శా - మానవులు వినిపించుగోక పోయినాసరే, అవ్యాకరణం కంటె కువ్యాకరణం నయం.

స - మరిసెలవ్, ఒకేమాటకి వారించేవారు; వేర్వేరుగా నిర్వచనం చెప్పేటప్పుడున్నూ, లేనిపోనిచోట్లకూడా ఆదర్శాలు అంటూ మొదలెట్టేటప్పుడున్నూ, అహంభావత్వాలు బయలుదేరినప్పుడున్నూ, వాదనలుకూడదను.

శా - అల్లాఅయితే సుబ్బారాయవోయ్, వ్యాకరణం! నువ్వు శాసించు!

స - అబ్బ! అదికాదు వ్యాకరణం అంటే అదిచెప్పలేదూ! పోనీలెండి. దీనికి అంతేమిటి తెంపేమిటి? సభట సాయింత్రం, ఆనందం సంగీతరావూ వాళ్ళూ వస్తారట. మీరు కూడారండి.

వాదం అనేది మనతోనే ఉంటోంది ఎంచేతోకాని !

(అని కుడివేపుకి వెళ్ళిపోతాడు)

శా - చూద్దాం ! (నిష్క్రమిస్తాడు)

---

## ప ద్యం - రా గం

[ఇంట్లో వీధిసావిడిలో బల్లదగ్గిర కూచుని భావరాజు కాగితాలు చూసుకుంటూ ఉంటాడు. ఇంకా కుర్చీలు ఉంటాయి. ఎడమవేపునుంచి వస్తూ, సంగీతరావు—]

సంగీత—ఏమండోయ్ !

భావ—(అటుచూసి) ఎవరది ! సంగీతరావ్ !

సంగీత—ఏయ్ !

భావ—రా, రా, రా,! (కుర్చీచూపించి) కూచో ! మంచితీర్థం కావాలా ?

సంగీత—అక్కర్లేదు

భావ—కాఫీ అయిందా ? ఊఁ, విశేషాలు ? ఇంకా నీకు ప్రమాణాలు ఏమన్నా దొరికాయా ? పద్యం అన్నా, రాగం అన్నా ఒకటేననీ !

సంగీత—ఓ! కోటీ !

భావ—ప్రస్తుతం ఓటి చెప్పు !

సంగీత—ఆ మాటకొస్తే ప్రమాణాల ప్రాలుద్ధం నీకూ ! నాకేం ? జనవాక్యాన్ని అనుసరించిపోయే వాడికి ప్రమాణం

అదే గానరసం పశువులుకూడా తాగుతాయి. కాని గానార్థం మూఢులకి తెలియదు. అంచేత జనం నాపక్షమే. ఆచారం ఊరికే వస్తున్నదా ? రాగంతో కలిపి పద్యం యథాశక్తిగా పాడకపోతే పద్యం చప్పగా చచ్చి ఊరుకుంటుంది.

భావ—మస్సీ చెప్పే పద్యం అసలు అదివరకే చచ్చిపోయి ఉన్న బాపతేమో ?

సంగీత—కాను కేమంటె ! నాకూ ప్రమాణాలు ఉన్నాయిస్తే !

భావ—ఏటి చెప్పు !

సంగీత—కుశలవులు వాల్మీకిరామాయణం———

భావ—అప్రాస. అందులో తెలుగు పద్యాలు ఉంటా ?

సంగీత—భరతశాస్త్రంలోటా, మరీ ! ......

భావ—శ్లోకంలో ఉండే అక్షరం ఒక్కొంటికీ ఒకస్వరం చొప్పున నిర్ణయంచేసి, వేదంలోలాగ ఉదాత్త......

సంగీత—అట్టెట్టె ! ఆగు. అంటె పాడటమేగా !

భావ—కాదు. అందులో స్వరం పాటవ్యాపారం కాదు; అర్థం పరిష్కరించడానికీనూ, అక్షరచ్యుతి నివారించడానికీనూ !

సంగీత—అల్లాయితే నాకింకో మంచిప్రమాణం ఉంది.

భావ—చెప్పు !

సంగీత—నాగొంతికి బాగుండదు.

భావ—ఛ! బొంగుసుమా, కీచూవర్గైరా లేదే! నిక్షేపంలా ఉంది. అయినా నీగొంతిగ బాగుపడడానికి మనం ప్రస్తుతం ఏంజేద్దాం ?

సంగీత—అదికాదోయ్! నాకు పాటరాదు. పైగా తగని సిగ్గు!

భావ—నీకు బోలెడు రావచ్చు, రాకపోవచ్చు. అందులో పాటకూడా ఉండవచ్చు. నీ పాటగోడవ ఎందుకిక్కడా? పోనీ, ఆ ఉన్న సిగ్గు గిరవటెట్టి జనానికి సుస్తీ చేసేదాకా పాడేయ్, నీకళ్లు చల్లగా ఉంటాయి!

సంగీత—పాడను. నా కనుకూలించే ఒక మంచి ప్రమాణం పద్యరూపంలో ఉండిపోడం నాకు మాచెడ్డ చిక్కొచ్చింది. మంచి గాత్రంవాడొచ్చి అది పాడితే తప్ప ఆ పద్యానికి పూర్ణ జీవం ప్రజ్వలించదు. ప్రజ్వలించకపోతే ఏం అంటే, నావాదన నెగ్గదేమో అని భయం.

భావ—సరేగాని, పద్యంఅంటే నీ అర్థంఏమిటి?

సంగీత—చాల్లేస్తూ! నువ్వే సర్వజ్ఞుడవైనట్టు గీర్వాణం కబుర్లు చెప్పకు, ఎవడేనా నవ్విపోగల్డు! నీఅర్థం?

భావ—పాదాలుకలిగింది అని.

సంగీత—ఎందుకు?

భావ—నడకవీలుకోసం.

సంగీత—ఎందుకు?

భావ—నడకెందుకు! నడవడానికే!

సంగీత—వచనంమాత్రం నడవదూ?

భావ—పద్యం నియమప్రకారం నడుస్తుంది. పద్యానికి తాళం పడుతుంది.

సంగీత—అదిగానమే పోవోయ్ !

భావ—రాగం కాదుగా ! పోనీ, నీ అర్థంపమిటి పద్యం అంటే? నువ్వు వాశినమూటేగా, దానిఅర్థం నీకు తెలియద్దూ! పద్యశాస్త్రం యావత్తూ చూసి పద్యకోటికి జీవం లేదని కనిపెట్టిన జ్ఞానివి !

సంగీత—ఓ! పద్యాలుకూడా కడ్తాను.

భావ—ఎల్లాంటివి ? వాటిల్లో జీవం లేదని కనిపెట్టి మళ్ళీ అల్లాంటివే తయారుచేస్తున్నావా ?

సంగీత—"సూర్యు డొకడు మీాద సురరాజు లిద్దరు—దినకరద్వయంబు తేటగీతి" (అని పాడి) హేం, రాదనే?

భావ—ఈపద్యం పేరు ?

సంగీత—లక్షణంగానే ఉంది. నీబోటిగాడికోసమే ఆపద్యం పేరు అందులోనే రాసిచ్చాను కవి!

భావ—ఏ విచక్షణ గొప్పది. ఇంకా?

సంగీత—"కందము త్రిశరగణంబుల—నందముగా" (అని పాడతాడు)

భావ—అంటే ?

సంగీత—'అందముగా' అంటే 'చక్కగా'.

భావ—భేష్ ! బాగా అన్వయించావు 'గా'!! ఇక్కడి తోటి ౨౬ ఛందాల ప్రస్తారం అయిపోయింది. అల్లానే నువ్వుతీసిన రాగంతోటి ౭౨ స్వరాల ప్రస్తారం అయిపోయింది. అప్పుడప్ గనక, నువ్వు రాగాలు నంజా

కుంటూ పద్యంలో ఉండే పదార్థం లగాయించు! నువ్వు ఒక్కడివే ఉన్నప్పుడు! అప్పుడేనా కాస్తంత తలుపులు బిడాయించి ఉండేట్టుగా చూసుకుని. పద్యాన్ని నీరాగంతో నీచిత్తప్రకారం పాడుకుంటుగో! వద్దన్నవాణ్ణి మాటర్థి పిల్చి కూర్చోబెట్టు. కాని నాకుగాని, మరోడికిగాని పద్యం వినిపించవలిసినచ్చినప్పుడు ఎల్లా వినిపిస్తే అది అందుతుందో అల్లా వినిపించు. పోనీ, పాడు. అనుభవిస్తాను.

సంగీతం—నేను పాడనేపాడను. ఆ అనుగ్రహం పొందడానికి నువ్వు నోచుకోలేదు. అసలు నాపద్యాలు వందలూ వేలూ అవడంతోటే అవి జీవించేనిమిత్తం చేసే వాటిని పాడితీస్తాను. అందుకు నారాగం చాలకపోతే రసాద్ధి కలిగించే కంఠంగల వాణ్ణిగాని నా పద్యం ముట్టుకోనివ్వను. అల్లాంటివాడొచ్చి పాడినప్పటికీ నాపద్యం 'ఓమోస్తరుగా ఉంది' అని జనం చప్పరించి పారేస్తే, ఆ ఓమోస్తరుగా ఉండడం ఆ పాడుపాఠకుడిది గాని నాపద్యానిది కాదంటాను. నాపద్యంలో లక్షణాలు ఉండనిస్సీ, నేను అది పైకి అని చూపించలేననిస్సీ, దానికి శ్లాఘ ఏమాత్రం ఎవడు ఏం చేసి తెప్పించినా అది నాపద్యానిదే అనిస్సి వాదిస్తాను. ఇంకా మంచికంఠం వాడొచ్చి ఇంకా బాగా పాడేసి ఉంటే నాపద్యరత్నం ఇంకా బాగా ఉండేనాను, ఆ ఇంకా బాగుండడానికి నిమిత్తమాత్రుడుగా ఉన్న మంచికంఠంవాడు పెట్టేరాగం నాపద్యంలోంచే బయల్దేరిందిగనక దానిమెప్పుకి మొదటి నారసత్వం నాదే అని దెబ్బలాడి లాక్కుంటాను. గొప్పకవులందరికీ

గానంకూడా రావాలి, నాకు బోలెడువచ్చును, అయితేం నాకు మంచికంఠం భగవంతుడు ప్రసాదించకపోవడంవల్ల నేను తగ్గిఊరు కున్నాను, నాతప్పులేదు అంటాను. మంచిపాట రానివాణ్ణి రాగరహితంగా నాపద్యం కాదు, ఎవడి పద్యంకూడా పఠించనివ్వను. ఎవడేనా పఠిస్తూంటే కూచోను, కూచున్నా వినను, విన్నా దౌర్భాగ్యంగా ఉందికదా అనుకుంటూపింటాను, ఆప్యాయంగా వినే ఇతరులకి చూసి కళ్ళ నీళ్ళెట్టుకుంటాను. పాముకికి పాట ఇష్టంట, నీకు లేదే! గానంలో ఎంత మాధుర్యం ఉంది? ఎంత రసం ఉంది?

భావ—ఓరేయి! ఇప్పుడు నువ్వు రసం అన్నావుగదా! ఆ రసంయొక్క స్వభావం ఏమిటో చెప్పు! అది కవితారసమా, గానరసమా, గానకవిత్వాల మిశ్రమంపురసనూ?

సంగీత—నిమ్మకాయిరసంరా! లేకపోతే ఏమిటి నీ కుతర్కం! నేను 'రసం' అనే ఆ ముసలిమాటంటే అట్టే ఖాతరీచెయ్యను. గొప్పగొప్పవాళ్ళ ఉహ—అందులో ముఖ్యంగా నాఊహ—ఏమిటంటే, పద్యంలో రాగం సజావ్‌గా మిళావ్ చెయ్యవచ్చునని. అవగా, కవితాకన్య పట్టిగా వెళ్ళి గానరాజు ఒళ్ళోపడి "నన్నేలుకోరా నాకోడిరాజా!" అని నిత్యమూ గోలపెడుతూ ఉంటుందని. గానంలో ఉండే హుషార్, మజా లాంటివి నీకు తట్టినట్టు లేదే! నీకు గానపరిచయం ఏమాత్రం ఉన్నా గానం వద్దంటావా?

భావ—నేను అనటంలేదు. గానం గొప్పదని అంతా ఒప్పు

గుంటారు. "ఎవరిగానం?" అంటేమాత్రం అన్నీ తగాదాలే. గానసంగతీ,సంగతులూ ఎక్కువ శా నీకు మరి తెలిసి ఉండవచ్చు. కాని, నేనేదో నిన్ను బలవంత పెట్టినట్టూ, బాగుండదని నువ్వు బాధపడ్డట్టూ నటించి నువ్వు అడ్డంపడి నీగానంమాత్రం మరి నామీద ప్రయోగించకు! నీవిద్యారాగసంపుటీ నాకు అక్కర్లేదు. ఆ నుళ్లావ్ నువ్వు ఎల్లా చెయ్యగలవో చూద్దాం అని నాకు కుతూహలం లేదు. నీదగ్గిర ఉన్నవి మాటలైతే, ఆమాటలు వినిపించు.

సంగీతం—మామూలు మాటలు కావురా!

భావ—కాకపోతే మరీ జాగ్రత్తగా, మరీ స్ఫుటంగా వినిపించు.

సంగీత—ఆ బోడిమాటలు! బోడిగానా?

భావ—అవును.

సంగీత—ఒరేయ్! అలంకారాలూ, ఆభరణాలూ ఉంటే ఆనందం ఎక్కువవుతుం దని నేనంటే, అంతా బోడించమంటా వేం రా? ఆబోడిని బోడిలా ఊచమంటావ్?

భావ—ఛందస్సుయొక్క బోడితనంగురించి నీఅంత ఎవ్వరూ గ్రహించలేదు. తెలుగుపద్యసముదాయం మావత్తూ అనాథస్థితిలో ఉందని గ్రహించి, దాన్ని పునిస్త్రీని చెయ్యడానికి నవరంలాంటి రాగం దాన్నిక్కి పెట్టి డాబు చేయించి నువ్వుగనక బాధపడుతున్నావు! నీ పరోపకారబుద్ధి మెచ్చతగ్గదే! కాని, నువ్వుచేసేపని మోసం గనక నేరంకిందికి వస్తుందేమో!

సంగీత—ఎక్కడేనా, ఉద్ధరించి బాగుచెయ్యడం నేరమా?

భావ—ఈ విషయంలో బాగుచేస్తున్నానని నువ్వు అనుకోడం మెచ్చతగ్గది కాదు. ఎందుకంటే, అసలు అది పాడుగా ఉంటుందని నువ్వు అంతకుముందే అనుకుని ఉన్నావవు గనక. అల్లా అనుకుని, అయిన పద్యానికీ కానిపద్యానికీ, అయిన రాగమూ కాని రాగమూ అయినకాడికి తగిలించి, కళాయిపెట్టి, అల్లా చెయ్యకపోతే ద్రోహం జరుగుతుం దనుకుని అలా చేసి ద్రోహంచేస్తూ, పద్యాలయొక్క స్వత్వం తద్వారా చంపి వాట్లకి సహజంగా ఉండే నాదసౌఖ్యం వగైరా పైకి రాకుండా చేసి, పైపెచ్చు నువ్వు చచ్చిచెడి చంపి చేసింది మహోపకారం అనుకుంటున్నావ్!

సంగీత—సివి అనవసరపు పేచీరా! పద్యం పాడకపోతే అందులో ఇహ నేం ఉంటుందిరా నా బొందా! అసలు పద్యం అనేది లేకపోయినా తగాదాలేదు కాని, ఉండడం పాడకపోడం ఏమిటి? ఎవళ్ళో పాడడంచేత గాలి రకాలు అమాట అవాలి గాని, హాయిగా హిందూస్తానీ సంగతులు గుప్పగలిగి, గవ్వలగుత్తికిమల్లే గలగలలాడే శారీరం ఉండి, పావురాయికిమల్లే పల్టీలు కొడుతూ, 'జా' మని శ్రుతిమోగుతూ, మళ్లీ పాటకచేరీ అంత రాగం వచ్చినానరే పాడక ఉచితమైనరాగం తీస్తూ తగుమాత్రంగా ఆలపిస్తే, అప్పుడు పద్యంయొక్క శోభ ఉంటుం దోరీ? ఏం చెప్పను!

భావ—ఏపద్యం పాడకపోయినా పడిపోసినట్టే ఉంటుందా?

సంగీత—ఆ అక్షరాలా! ఏడుస్తూకూడా ఉంటుంది, మొహమేనా తొంగుచుగోసట్టు!

భాష—తెలుగు సాహిత్యంలో ఏపద్యమైనా అంతేనా?

సంగీత—తెలుగే కాదు, ఏ భాషైనానాఅభిప్రాయం అంతే!

భాష—నిజమే! ఇతరభాషలు మనికి తెలియవు, వద్దు. మన భాషలో ఒకొక్క పద్యంలో గణాలతాలూకు శాస్త్రం మాత్రం మనికి లభిస్తుంది గాని, కవిత్వకళ కాగడావేసినా కనపడదు. అల్లాంటి పద్యం ఏడుపుగొట్టుపద్యం అన్న మాట. అందుచేత, అసలుపద్యం ఏడుపుగొట్టుపద్యం అయినా, చెప్పడపు రీతిఏడుపుగొట్టుగా ఉన్నా, ఉభయత్రా ఫలితం ఏడిసినట్టే ఉంటుంది. ఒక వేళ, ఏదేనా పద్యం చెప్పినప్పుడు ఏడిసినట్టుండి, రాగం కలపగానే బాగుంటుంది అంటావా, ఆ బాగుండడం రాగానిది. అయితే, పద్యం గురించి మన విషయం కదా, రాగం యొక్క బాగోగులు ఇప్పు డెందుకూ?

సంగీత—సరే లేవోయ్! నువ్వుప్రతీదీ ఇంగ్లీషుగొడ్డుకత్తో వేల్తేస్తే ఎల్లాగా? నువ్వు ఎల్లాగైతేం మాకేం పొట్టకూటికోసం ఇంగ్లీషు చదువుతున్నావ్ గదా అని, అందులోవన్నీ తెలుగులోకి దింపుతే ఎల్లా ఏడుస్తుందీ! శాస్త్రం, కళ అంటూప్రారంభించా వేమిటి? ఆంధ్రులికి అన్నీ ఒకటే. 'సర్వం జగన్నాథం'. మమేకం. పైగా నువ్వనున తెలుగుభాషకుండేప్రత్యేక అఖండత్వం కని పెట్టినట్టు కనపడవే! ప్రపంచంలో ఏ ఇతరభాషా ఇంత మధురంగా ఉండదు. అందుకని ఇది పాడుకోడానికి పెట్టింది పేరు.

అరవల్ని చూశాడు.

భావ—అవును, నీవాదన అల్లాంటిదే! కాని, ప్రకటన అవుతూన్న భావం జీవితానికి అవసరం అయినప్పుడు, ఏ భాషలో ఆ భావం ఉందీ, స్వభాషా కాకుండా మరో భాషలో లేదు కదా అని కనుక్కోడంగాని శంకించడంగాని తెలివితక్కువ. మంచిముక్క ఏభాషలో ఉన్నా మన్నించవలసిందే! నీకు అనుకూలించిన చోట ఒక ఇంగ్లీషన్న మాటేమిటి ఏ ఎంగిలి భాషైనా సరే ఒప్పుకుంటావు. ప్రతికూలించేచోట ఇంగ్లీషు అంటావు, అది వేరు ఇదివేరు అంటూ ఆరాలు తీస్తావు. కొందరు ఏదేనా సరే సంస్కృతంలో ఉంటే గాని ప్రమాణంగా స్వీకరించరు. కాని, వాళ్ళు మెచ్చే సంస్కృతంలోనే ఒక శ్లోకం ఎవరిచేతో రాయించి దానిని వాళ్ళ సన్నిధికి పట్టికెడితే, అది ప్రమాణంగా వాళ్ళే ఒప్పుకోరు. ఇష్టాయిష్టాల్ని బట్టి ఉంటుంది. ఎల్లా ఉన్నా—మనస్సు, బుద్ధీ తరవాత భాషా! నేను మనస్సు గురించి కొన్ని విషయాలు నిన్నడుగుతూంటే, నే నేదో ఇంగ్లీషు ప్రమాణాలు తెలుసుకొని సంధించానంటావేమిటి? శాస్త్రం, కళ అనేవి ఇంగ్లీషులోనేనా ఉంటా? వాటిని నిర్వచించి అవి మనికి లేవు అని మనం పరిహారం చెయ్యగలమా? ఆ భావాలు మనకి ఉండిఉండకపోతే మన భాషలో ఆ పదాలు ఎందుకు ఉద్భవించాయి? పోనీ, మన భాషకి అఖండత్వం ఉందన్నావే! అది తప్పకుండా ఇతరులనేమాట. వాళ్ళకేం? డబ్బుఖర్చు కాకుండా ఉండేటప్పుడు మెప్పుకురిపించడం మానవులకి స్వభావం. మనంకూడా అట్లాచే

అనుకోడం ఏం గొప్ప! తత్సంబంధాలు గాని, తర్జుమాలుగాని కాకుండా తెలుగులోఉన్న అపూర్వగ్రంథాలు వందలున్నాయా వేలున్నాయా? చెప్పు. అల్లాంటివి ఉన్నమీదట భాషని ఇంకా పెంచడానికి చేసుకునే భాషాంతరీకరణం గౌరవనీయం. లేనప్పటిది కక్కూర్తి. నేటి వరకు కక్కూర్తి తర్జుమా మానిందా మనభాష! ఇక స్వతంత్రరచనలు బయలుదేరి, కావ్యనిధులు ఉద్భవించడం ఎన్ని శతాబ్దాలకీ! వేమన్నని ఇంగ్లీషులోకి పట్టి గెళ్లాను. 'వసుచరిత్ర' సంస్కృతంలోకి తర్జుమాచేశాడొకాయన అని శాస్త్రుల్లుగారు చెబుతూంటారు. 'కన్యాశుల్కం' 'రాజశేఖరచరిత్ర' కూడా అరవం వగైరాల్లోకి మార్చుకున్నారట. ఇల్లాంటివి మినహాయించి, బలవంతంగా తెలుగువాడే అన్యభాషల్లోకి దింపిన రచనలు విడిచిపెట్టి, తెలుగుమాహాత్మ్యంవల్ల తెలుగు గ్రంథాన్ని దేన్నైనా ఇంకోభాషవాడు పట్టిగెళ్ళి తనవాళ్లకి చెప్పుకుంటున్నాడా? అదీగాక నీ నాపోట్లు తెలుగులో పదజాలం సమృద్ధిగా లేకపోడంవల్లేటగా నిత్యమూ ఇంగ్లీషుపదాలు టంకంపెట్టి మాట్లాడ్డం! ఇహ, తెలుగుయొక్క అఖండత్వం ఏమిటి? ఆమైని, భాష మధురం అన్నావ్! ఏ దయవల్ల ఎవరి భాష వాళ్ళకి మాధురంగా ఉంటుంది. న్యాయుత్తు ఉండాలి. పోనీ, అన్యభాషల వాళ్లకికూడా తెలుగుభాష మధురంగా వినిపిస్తుందనే ఒప్పుకుందాం. అటువంటప్పుడు, భాషే మధురం అయినప్పుడు అతిమధురం, మహామధురం, అనిపించడానికి కా కవిత్వంలో రాగం సంపుటీచెయ్యడం? ఏదేనా కలిసినప్పుడల్లా

పులగంమీద పప్పు అని మనం అనుకోనూవచ్చు. ఒకోప్పుడు అప్పుడు శూన్యం కలవచ్చు, తరుచు ఋణం కూడా రావచ్చు. అందుచేత తెలుగు కవిత్వంయొక్క సహజగమనం గమనించకుండా, పాడుకోడం అనేది తెలుగుయొక్క ప్రత్యేకవిశేషం అనుకోడంకంటె తెలుగుయొక్క ప్రత్యేకదౌర్భాగ్యం అని ఎంచడం మంచిది.

సంగీత—ఇదేమిట్రోయ్. మనశాస్త్రాలకి !

భావ—అదుగో మళ్ళీ వెనక్కెడతావే ?

సంగీత—అబ్బ ! ఉండవోయ్ ! నువ్వొ వెళ్ళు ! మన శాస్త్రాలకి శూన్యంపెట్టి మాట్లాడుతున్నావే ! రత్నశాస్త్రుల్లు బోలెడన్ని శ్లోకాలు చదివాడురా మరి ! అది గాక ఆఖరికి తెలుగులోకుడా వసుచరిత్రలో ఓ అమ్మాయి కాంభోజిలో ఏడిచిందని ఉందిటగా ! అందుకని పద్యాలన్నీ పాడితీరాలి, ఏడిచితీరాలి !

భావ—అనగా ప్రతీ తెలుగువాడూ ముందు కాంభోజి నేర్చుగుని, తరవాతేగాని ఏడవకూడదని పెట్టాలంటే చావాలి ! ఏడిచినట్టే ఉందిరా ! అది ఒక అమ్మాయి ఏడుపు గురించి కవిభావన. అందుచేత తెలుగుపద్యాలన్నీ పాడాలని ఆ పద్యంలో ఎక్కడుంది ? 'కాంభోజి' అనే పదం ఆపద్యంలో ఉండడం వల్లగావును, ఆపద్యాన్నే హైసరమజ్జా అని కొందరు కాంభోజిలో ఎత్తుగుంటూంటారు !

సంగీత—అల్లాయితే, పద్యం ఎందుకోయ్, పాడడాని

కాకపోతేనూ !

భావ—అనుకోడానికి, మననం చేసుకోడానికి, చెప్పుకోడానికి, స్వంతానికి ఏదేనా నోట్ చేసుకోడానికి, ఇతరులతో మాత్రం చెప్పడానికి !

సంగీత—చెప్పి ఊరుకోడం కర్మమేమిటి ?

భావ—అక్కడ ఏ రాగం కూడా కవిచేత నిర్ణీతం కాలేదు గనక !

సంగీత—ఓరి వెర్రీ ! అదే నీ అజ్ఞానం, కవి ఆ స్వేచ్ఛ పాడుకునేవాడి కిచ్చాడు.

భావ—పదాల్ని గణాలనే సంకెళ్ళలో వేసి, రాగంలో స్వేచ్ఛ ఇవ్వడం అంటే ఏమిటి ? ఎంతవరకు ?

సంగీత—ఉచితమైనంతవరకు.

భావ—ఎవరికి ?

సంగీత—సభ వారికి.

భావ—ఏ సభ మాట నువ్వనేది ?

సంగీత—పండితపామరు లుండేది. పండితులకి ఎల్లానూ తెలుస్తుంది. పామరులికి తెలియకపోయినా చెవికి ఇంపుగానేనా ఉంటుంది.

భావ—తెలిసి హాయిఇచ్చేది కవిత్వం. రాగసంపుటీవల్ల అర్థం ఎక్కనకాకపోవడం అటుంచి, చిన్న అర్థమేనా జీవించి పైకొస్తుందనేనా నీ ఊహ ?

సంగీత—కాకపోతే, ఏమోరా ! శ్రోతకే తద్దినపు మంత్రం

లాగా చెప్పడమూ ?

భావ—అబ్బే ! వివాహమంత్రంలాగ చదువేసి పాడు.

సంగీత—కాదురా ! ఊరికే ఉన్నదున్నట్టు !

"ఉప్పు కప్పురంబు నొక్కపోలిక నుండు
చూడ చూడ రుచుల జాడ వేరు" అంటూను !

భావ—కాక, ఉన్నది లేనట్టూ !

"హుప్పూ కప్పూర్బ్ హొక్క్ పోల్క్ హైతో
సూడసూడ రుస్సుల్ ఝూడా వేరు" అంటూను !

సంగీత—సంస్కృతంలో శ్లోకాలు పాడతారు.

భావ—రాగం కానటువంటి క్షణితిలో చదువుతారు.

సంగీత—సేది కుతర్కంరా. రసానికి అనుగుణంగా రాగాలున్నాయిట. తెలుగు పద్యాలు పాడవలసిందే !

భావ—నాదం బ్రహ్మం. గానం ఆనందం. తెలుగు గానం అంతే అల్లాంటిగానంలో ఉండగల రాగాలికి పట్టిరాసిన అనంతు డెవడూ ? గానశాస్త్రాలన్నీ శోధించెయ్యి. ఉచిత మైనచోట ఉచితరాగం అని ఉంటుంది ఎక్కడ వెతికినా ! రసానుగుణరాగవిషయంలో ఏ ఇద్దరి అభిప్రాయాలూ ఏకీభవించవనికూడా ఉంటుంది. కొందరు వీరం, శృంగారం, కరుణ, హాస్యం———వీట్లకి సంపూర్ణరాగాలనీ, వీరానికి షాడవాలనీ, శోకభయానకాలకి ఔడవాలని అంటారు, మరికొందరు...

సంగీత—ఏమిటి నువ్విప్పుడు మాట్లాడేది ?

భావ—నువ్వేచెప్పిన 'రసానికి అనుగుణంగా రాగాలు'

అనేవాక్యానికి అర్థం.

సంగీత—అబ్బా! ఏమిటోయ్! ప్రతీదానికీ ఏదో తప్పు తీస్తావు? భూపాలరాగం కోపం చూపించమిటోయ్!

భావ—భూపాలరాగం శాంతరసంలో పాడమని మీ శాస్త్రాల్లో ఉంది. కొందరు శోకానికి వాడి చూపెట్టారు.

సంగీత—ఎన్నాట చెప్పు! ప్రతీచోటా రాగం ఉండచ్చు!

భావ—ప్రతీఅప్పుడూ మధ్యమావతి పనికొస్తుందట. అదీ గాక, కోపాళ్ళకు రాగాల్లో కూడా అడ్డమైన వివక్షతగురించీన్నీ,

సంగీత—అబ్బా! చాల్లా!

భావ—ఒకాయన రాగాల రంగులనుగురించిన్నీ, ఒకాయన వాళ్ల రూపాలనుగురించీన్నీ.

సంగీత—అబ్బ! ఉండవోయ్ సోదా! నీదంతా శాకదంతో పరీక్షలా ఉందే! ఎక్కడోగానీ! నువ్వు చెప్పిందాన్నిబట్టి మరో ప్రమాదం వస్తుంది. పద్యాన్ని ఉత్తవచనంలా చెప్పి పారెయ్యమంటున్నావుకదా, అల్లాయితే పద్యం ఎందుకు? మాటల్ని తీసికెళ్ళి కష్టపడి అతుకులెట్టి మార్చి బాధపడ్డం ఎందుకు? లేనిపోని నీమాలుపెట్టుగుని రాస్తే వచ్చిన గొప్పేమిటి? 'నే నెంతకష్టపడి ఈమాటల్ని గణస్థానంలో పడేసి మేకులు కొట్టానో చూశార్టండీ' అనడానికా? గణాలు తెలుసును గనక కవినని పేరుపెట్టుగోడానికా? వచనమేరాస్తే పేచీలు వదుల్తాయి. వచనంలోమాత్రం కవిత్వం ఉండకూడదూ? యతీ ప్రాస మిదమిరాది మంచిభావాన్ని పాడుచెయ్యడం

ఎందుకు ?

భావ—పద్యాలకి నియమిత గణాలవల్ల జనించే నడక లుంటాయి. గణాల్ని నిమిషంలో చూసెయ్యొచ్చు గాని, వాట్ని నడిపించడం వేరు. మోటారుకేకి చూసి చూడడం తోటే నడిపించడం చేతకాదు. శాశ్వతత్వంపొందిన ప్రపంచ కవిత్వం పద్యరూపంలోనె నిక్షిప్తఉంది. నడక అనేది వేదపురుషు డికి పాదాలు అని అంటూనే అంటారు. సముద్రంలాంటి ప్రాపంచికానుభవం పైకి తెచ్చుకోగలకవికి నడక ఈతలాంటిది. కవియైనవాడు వాడినపదాలకీ నడకకీ అనుకూలదాంపత్యం ఉంటుంది. అల్లాంటి పదాల్నెంచి ఆనడకని వేరుచేస్తే పదాలూ, నడకా కూడా జీవం పోగొట్టుకుంటాయా అనిపిస్తుంది. యతీ, ప్రాసా వగైరాలు ని నాప్తోళ్ళకి చిక్కు, గండం, మృత్యువు. ఒకొక్కడు పద్యమే రాస్తాడు, గద్యఅయినా సరే, చివరికి కాస్త రాసినా సరే గణాలు ఇట్టే అతుకుతూంటాడు. నిశాసికూడా పాడుచేసేవాడు ఉండొచ్చు. నువ్వొప్పుకు పద్యం, రాగం అనేవి ఏమిటో చూపించడానికే పద్యం రాగంతోప్యవలిసిందే అంటున్నావు. అల్లానే కొందరు గణాలువేసి పద్యాలు కట్టి కవిబిరుదు కొట్టేస్తుని చూసేవాళ్లుండచ్చు. కాలక్రమాన్న వాళ్లు వొట్టి గణాచార్యులుగా ఉండిపోతారుగాని కవులుగా మారరు. కవి అనుభవించేటప్పుడు శిసకి ధ్యానం అంటూ ఒకటి ఉంటే, అది ముందు వచనంలో ఆలోచించి తరవాత ఆపద్యాలే పద్యంలో సరిపోయేటట్టు సాగగొట్టి సద్దుతు. ఒకొక్క కవి

ఆసక్తినిబట్టి పద్యరూపం వాడికి స్వాభావికం అయి పోతుంది. "కవిత్వంబులు నాకు చెందనివి యేమోయంటివా నానుజిహ్వాకు నైసర్గికకృత్యములతోసుమీ" అనిధూర్జటికి కాళహస్తీశ్వరుడితో అంటాడు. అల్లాంటివాళ్లు పద్యం చెప్పినప్పుడు అది వాళ్ళకి మామూలుగానే ఉంటుంది. మనం తెలుగుతప్ప మరేదో నేర్చుకుని తెలుగుమీద తీర్పుచెప్పడం అధర్మం. తెలుగులో ఉన్న పద్య భాగం అంతా చూస్తే పడేస ఎందుకో తెలుస్తుంది. ఇంక మంచిభాగం పాడుచెయ్యడం అన్యాయం. ఆలోచన పైకి రావాలంటే సాధన ఉండాలి. ఆ సాధనసంపాదాయమే ఆ భావానికి భాష. ఆ సాధనమున్నా, చిత్తవృత్తిని మేళవించిన మీదట ఆ భావం పుడుతుంది. భావం పుట్టేటప్పుడే భాషలో పుడుతుంది. ఆ భాషలోనే ఆ భావం ప్రకటనఅయి జీవిస్తుంది. ఆ భాష పదం, స్వరం, రంగు, రాయివగైరా ఏదేనా కావచ్చు. పదరూపంలో ఉన్న భావాన్ని ప్రకటించడానికి స్వరరూపంలో ఉన్న రాగం ఎందుకు పట్రావడం? ఒకపద్యంలో ఉండేభావం ఆపద్యమే చెబుతూంటుంది.

సంగీత — మాచెడ్డ చిక్కుగా ఉందే నీతో! సమర్థుణ్ణి నీవు కవిత్వం పద్యరూపంలో చెప్పనిచ్చినట్టుగానే సమర్థుడైనవాణ్ణి పద్యం పాడనీ.

భాష — మహారాజులాగ! పద్యాన్ని పాటకి అనుకూలంగా చేసి చూపెట్టేవాడు కవిత్వ గానాల రహస్యాలు తెలిసినవాడు అయివుంటాడు.

సాక్షిచేస్తున్నావ్ !

సంగీత—మరి లేకపోతే 'మ' అని ముందే ఎందుకు తగలేశాడోయ్ ? (అని ముఖం చిట్లిస్తాడు.)

భావ—ఓహ్, అదటోయ్ ! 'మ' అని ఉంటే నువ్వు 'మమ' అనుకుంటున్నావా ? బాగానే ఉంది. నిన్ననవలసిన పనిలేదు. అది తెలుగుకవులు అనాలోచితంగా పాటిస్తూన్న ఆచారం. ఏ యితరభాషలోనూ ఈ ఆచారం ఉన్నట్టు కనపడదు. ఛందోజ్ఞానంలో కవులకుండే ప్రజ్ఞ ఎప్పటికప్పుడు ప్రత్యక్షంగా ఇతరులకి తెలియజేయాలని కాబోలు! అట్లాంటి చిహ్నాలు ఛందస్సు తెలిసినవాళ్ళకి అనవసరం, తెలియనివాళ్ళకి నిష్ప్రయోజనం. పైగా అటువంటిచిహ్నం కనబడటంతోటే నీబోటివాళ్ళు తనదగ్గిర ఎంత గానం ఉంటే అంతా తీసుకెళ్ళి దానిమీదికి 'ఉస్సూ' కొలపడం, పాడుకోడానికే అవి వేశారని వాదించడం. పద్యం పేరేమిటో తెలిపే అక్షరాలు మొదట్లో వెయ్యకుండా పద్యాలు ఇకనైనా ప్రకటిస్తారని మనం నమ్ముదాం. మొహంమీద పేరురాసి మనిషిని పంపించినట్టే అదీనూ! తెలుగు చదువర్లలో చాలామందికి పద్యస్వరూపం అంటే ఆనవాలు తెలియదు గదా అని సాక్ష్యంయివ్వడానికి అవిఉన్నాయి! 'భైరవి' అని చెబుతూ భైరవి పాడినట్టు!!

సంగీత—అల్లాయితే నన్ను పాడొద్దంటావా ఏమిటి?

భావ—ఆ ఆలోచన మాటల్లో ఉన్నట్టుంది. ఆమాటలు చెప్పవోయ్ !

సంగీత—నే పాడకమానో్న్నయ్ ఏ కూనురాగమో పెట్టి. నువ్వు ఈపాటలు సగాని చెప్పు సుహా ఆ చెప్పడం ఏమిటో విందాం.

భావ—(కాగితం చూసి) ఇదా! 'సకలా మోపస తాళవృత్తిగతులన్ సంగీత సాహిత్యవామక విద్యాయుగళంబు పల్కుచెలికిన్ పాలింప్లజో డై' (అని చెబుతాడు.)

సంగీత—యెస్! ఇదా చెప్పడం! దీనికి స్వరం ఉంది. ఇది ఓ రాగమే!

భావ—నాదం లేదని ఎవ్వడూ అనడు. కాని, నియమిత స్వరాలు అక్రమం అయివుంటేనే గాని తెలుగులో రాగం అనేది జనించదని గానశాస్త్రం తెలిసినవాళ్ళంటారు.

సంగీత—జనించకపోతే వడిసినట్టుంది.

భావ—ఏమిటి?

సంగీత—పద్యం.

భావ—అల్లాయితే ఆసంగతి రామరాజ భూషణుడికి 'వైర్‌లెస్' కొట్టు, అంగారకుడులో ఉంటాడేమో, ఆగ్రహం ఇటీవల ఒక్కిలి సమీపంలోకి వచ్చిందిట, భూమికి.

సంగీత—పద్యం అంటే నీ చదవడం అన్నమాట.

భావ—ఏవిషయం? అర్థమా, భావమా, అన్వయమా, నడకా, ఊపా, విరుపా, ఊతపదా, యాసా, నొక్కూ, జారుపా, ఏమిటి పాడుగా ఉంటూ?

సంగీత—అన్నీ బాగున్నాయికాని, నా కది పద్యం అని

తెలియడంలేదు.

భావ—అదా! అంకుశని ఎవర్ని వేడవమన్నావ్! నువ్వు సర్వజ్ఞుడవనిన్నీ, అల్లాటప్పనీకుకూడా అది బోధపడదన్నీ తెలుసన్నీ, నీ ఊహ అయివుంటుంది. నీకు ఇది తెలిసాక పొమ్మచ్చు ఛందన్ను చూసేశావన్నావ్! "ఏరాగం విన్నా నాకు ఒకేలా వస్తురుగా ఉంటుం" అని కొందరంటారు. వాళ్ళమాటపట్టుకుని రాగాల్లో తేడాలే లేవని నువ్వు సిద్ధాంతం చేస్తావా?

సంగీత—అబ్బ! చెయ్యనోయ్! నువ్వు ఇంతాకా చెప్పినవన్నీ ఉంచి, ఓన్నా ఎత్తయినా నరే నాగంకూడా రంగరించవోయ్!

భావ—ఏరాగం? ఈ మాటలకిగల అర్థభావరసాలకి సరిపోయేది చెప్పు.

సంగీత—వడిసిపట్టే ఉంది. ఏదైతేం? ఏదోవొకటి.

భావ—అయినా. లేనిరాగం తెచ్చి దీనికి తగిలించి, ఉన్న తాళం మానెయ్యనా?

సంగీత—అబ్బ!

భావ—పోనీ తాళంకూడా వెయ్యమన్నావా? అక్కడికి కీర్తన అవుతుంది!

సంగీత—చంపుకుతింటున్నావ్రా, బాబూ! ఏ ఆనంద భైరవో విడిచి సదునుగా ఆ ముక్కలు కలపమూ..లేదూ!

భావ—ఎల్లా కలపడం? ఈ పద్యం మత్తేభం! మత్తేభంనడక కవులు చెపుకోనుగునే ఒకానొక నడక! ఆనందభైరవరాగపు స్వరాల నడక మరోటి! వాటి నడకలకి

తాదాత్మ్యం లేదు. అయినా సరే వాటిని కలపమంటే, ఒక దాన్ని చెడగొట్టి రెండోదాన్ని కాపాడి కలపవచ్చు—ఎవరట కలపనీ—పద్యం తాళంకూడా గమనించవు గనక. నేన్ని ఉంచమన్నావ్, కని చంపమన్నావ్? సాధారణంగా రెండూ చస్తాయి!

సంగీత—ను తేడా నడక ఎల్లాఉంటుంది?

భాను—'నననానన నానానా ననానా నానన నానానానా' అంటూ స్వరాలపోకగురించే సంబంధించి ఉంటుంది.

సంగీత—ఆనందభైరవి?

భాను—(ఆరోహణ అవరోహణలు చూపించి, ఆనందభైరవి పాడి) ఈరీతిగా స్వరాల స్థాయులతో కూడా సంబంధించి ఇది ఉంటుంది

సంగీత—ఆరి, నీతస్సులమంటూ! పాడ్తావురా! కంఠం ఎత్తలేవుగావును అసలు, అందుకని నీకు లేని పద్యం విద్యేకాదని బుజువుచేసి నిమిత్తం ఏదో మడతపేచీవేసి, ఏదైనావాదం ఓటి లేవదీశావేమో అనుకున్నాను—రిసర్చివాళ్ళు ఒక్కొక్కడు తనుకే గొప్పరావాలని లేవదీసినట్టు!

భాను—అనుకో! ఒకడు అనుకోకుండా కుడా ఇంకోడు ఎల్లా జాగరపడగల్డూ? సంగతి ఇది. ఇంకో లక్షు ఉంది.

సంగీత—నువ్వుచెప్పేది కొంత నచ్చింది కాని, కొద్దిగా, ఏమాత్రమేనా, ఒక్కోసారి రాగం ఉంటేగాని పద్యం విన్లేంరా ఒకవేళ రాగం శూన్యంచేసి ఎవడేనా చదివినప్పుడు వినడవు

ప్రాణార్థం పడితే, సచేలస్నానం చెయ్యాలి. పోనీ ఒకే! నాట కాల్లో పద్యాలుపాడేవాళ్ళు నెట్టినాన్లే?

భావ—'నాటకం' అనేమాట అన్నావ్ అంటే కొంప తవ్వావ్ అన్నమాట! అన్యత్వారోపణ ప్రత్యక్షంగా చూపించవలసిన నాటకరంగంమీద స్వత్వస్థాపన చేసే గానం అభినయక్రియకి సుముఖమా, విముఖమా అనేది సమస్య. ఆ దెబ్బతోటి మనం 'నాటక పద్యోచ్చారణ' అనే సమో ప్రవాహంలో పోవాలి. అదో గ్రంథం!

సంగీత—ఏమైనా సరేగాని, నాకు నచ్చలేదు పూర్తిగా.

భావ—నచ్చినప్పుడే ఆయిరి పోనీ! నీమనస్సుని మహా మాటబెట్టి నచ్చగొట్టకు, నీకు పుణ్యం ఉంటుంది. కొంప మునిగిందేముంది! ఆలోచించు! అంతవరకు మన తెలుగు పద్య కవిత్వానికి ఉచ్చారణలో ప్రత్యేక జన్మ సిద్ధించదు.

సంగీత—ఏమోరా, అబ్బాయి, ఇదొక అభిరుచి జనానికి. లోకం విధవిధాలు. కవనానికి గానం అలంకారం అన్నాగా!

భావ—ఎవరి కవనానికి ఎవరి గానంమాట నువ్వు చేసే! కవిత్వా లంకృతీ గానాలంకృతీ కూడా చూసి, సిద్ధాంతం చెయ్యవలసిం దని నిన్ను మళ్ళీ కోరుతున్నాను. ఉభయతారకం చేస్తామని బయల్దేరి ఉభయభ్రష్టత్వం చెయ్యకూడదుగా!

సంగీత—సరేలే. దయుంచు. మళ్ళీ కలుద్దాం.

(వెళ్ళిపోతారు)

—

# పద్యం - అర్థం

[ఆనందం, శేషూ, ఒకబల్లకి ఎడాపెడా కుర్చీలమీద ఉంటారు]

ఆ—నువ్వు ఒక్కవసనని తిడుతున్నావుట!

శే—ఎవర్ని? ఎవడాలన్నవాడు?

ఆ—కవిత్వాలు విమర్శిస్తున్నావుట!

శే—అంటే తిట్టడంఅనా! పోనీ. అయితే నీకేం?

ఆ—నా కవిత్వం ఎక్కో నువ్వు చప్పరిస్తున్నావుటగా!

శే—నువ్వు కవిత్వం చేశావా?

ఆ—నీకు తెలియనట్టే అక్కడికి. నా పద్యాలు ఉదాహరించావుట.

శే—నీపద్యాలు నేను ఉదాహరించినమాట నిజం. కాని అవి కవిత్వంకిందకి వస్తాయని నేను అనుకోలేదు.

ఆ—అయినాసరే, వాటినిగురించి మాట్లాడ్డానికి నువ్వు ఎవడవ్? నీకెవడిచ్చాడు హక్కు?

శే—నేను, రాయనున్నవాడే!

ఆ—పోనీ అల్లాంటి హక్కు ఉన్నప్పుడు కొత్త సాటితెలుగువాణ్ణి పొగిడి పెద్దవాణ్ణి చేసి కీర్తి తెప్పించాలిగాని విమర్శించుకుంటారా ఎక్కడేనా?

శే—నేను నీ పద్యాల్ని గురించి ప్రసంగించాను గాని నిన్ను గురించి కాదు. అనవసరంగా నువ్వు పూసుకురావడం ఎందుకు?

ఆ—బిడ్డకి అన్యాయం జరుగుతూంటే చూసి చూసి ఊరు

కోలేక!

శే—ఏమిటి ఆ అన్యాయం? ఫలానా అనిపించుకుని జీవించే దిక్కుమాలిన బ్రతుకు మొదట్నుంచి గెంటి జనసామాన్యంలోకి తోయ్యడం ఎందుకూ? వెనకాలే ఏమర్లేడం ఎందుకు?

అ—ఆ పద్యాలన్నీ కలిపి వార్తి 'భావకవిత్వం' కిందికి వస్తాయని టాకువేస్తున్నావుట నువ్వు?

శే—రామరామ! వార్తిని! వార్తివీ ఉత్తదీనూ! ఆ పద్యాల్ని 'కవిత్వం' అని టాకువేస్తూన్నది నువ్వు. వాటి 'భావం' గాక ఏమిటో నాకు బోధపడితే తక్షణం ఆ టాకు నేను ప్రారంభిస్తాను.

అ—సరి సరి ఇదోటా! నిను ఇంతా చేసి ఆ పద్యాలు తెలియనేలేదన్న మాట!

శే—ఛస్తే! (అని తల కదిపి చెయ్యి ఊపుతాడు.)

అ—(కొంచెం చిరునవ్వుతో) అల్లాంటప్పుడు నువ్వు నోరు మూసుకోడం ప్రశస్తమేమో, మన్నో మనమాట! అజ్ఞానంలో ఉండి అల్లా ఉన్నట్టు తెలిసేంతవరకైనా కుడా, తన అజ్ఞానం గురించి అట్టేచేసుకునేవాడుంటాడా, సినిమాల్లో "చెప్పు!" లాగ?

శే—నన్ను మానసిగలేనాసరి పడి, ఎంత అప్రతిష్ఠ కైనాసరే దోసిడట్టి, ఏ మాటల్లో ఉన్న సంగతి గ్రహించి తద్వారా తరించవచ్చని!

అ—అయితే ఆక్షేపణ ఎందుకూ?

శే—తెలియలేదని చెప్పడం ఆక్షేపణ కాదు.

ఆ కోట్లాది జనంలో నువ్వూ ఒకడవ్. నీకు ఒక్కడికే తెలి యలేదని నే సేడవనా?

శే—పోనీ వద్దులే!

ఆ—అసలు నా కవిత్వం బంగారం.

శే—నాకి చెప్పాలి, నీదో దాందో !

ఆ—గుర్రంలా సంతొక్కరికి, నా పద్యం.

శే—నీకే తెలియాలి గుర్రమో పుర్రోటో! నాకు తలా తోకా తెలియలేదు.

ఆ—అయితే, ఓ సంగతి చెప్పాలి, చేస్తాను, నా సొమ్ము ఎంత మంది తిన్నారో రూ!

శే—మొదట్లో! తరవాత నువ్వూ వాళ్లనే తినేశావేమో! ఇప్పుడు సొమ్ము సంగతి ఎందుకు? ఇదా అర్థం?

ఆ—ఓ సంఘటువు కొంప నీకు దానంచేసుగుంటే నీకు అర్థం తెలుస్తుందేమో అని.

శే—ఎక్కడికి ఒక్కడికే! పోనీ ఇల్లావారెయ్ సంఘటువు, దక్షిణ అక్కర్లేకుండా దానం పట్టేస్తాను!

ఆ—నీకు సరిగ్గా చూసుగోడం తెలీదుదేమో?

శే—నే నేదో తంటాలుపడతానులేస్తూ.

ఆ—అమ్మా! ఎంతాసే! ఇదా ఎత్తూ!

శే—ఇదా ఎత్తూ, నాటుగుపోడానికి! గంటసేపు ఇతరపన్లు కట్టిపెట్టి ఈపద్యాలు పుచ్చుగుని కూర్చున్నాను. నీకయపల్ల మాటలు తెలిశాయి. తెలియక ఏంజేస్తాను? "సరిసరి వీలు క

ప్సుర హర క్షణసుడు" "సర్వంగన స్థిత బిడాజ" వర్గాలగురించి చెప్పె నీ పద్యాల్లో మాటలూ ఎక్కువ సఘంటువుల కోరవు. కాని వీళ్ల భావం ఏమిటో తేలిందికాదు. 'దీనిభావమేమి తిరుమలేశ' అనే పొడుపుకథ పద్యాలైనా పెంద్రాళ్లే తేలాయి కాని, ఇవి కాదూ పేదూ తేలకుండా వచ్చాయి. ప్రతీదీ 'గొప్పతాయాయ మేకయూ!' అన్నట్టుంది.

ఆ—అసలు ఈపద్యాల్లో చూడవలసింది భావమూ, అర్థం కాదు. నేను రస కవిని.

శే—ఏ పద్యాల్లో నేనా అంతే. మాటలకి అర్థాలద్వారా భావం కలగాలి. "అర్థనశంబున నమసును భావంబు" అనేది సమ్మవ్? 'భావసంగతి గనుపట్టు రసము'.

ఆ—నమ్మలేను. అయితేం? నువ్వు, 'తెలియపాడదు' అని కూచున్నావుగా! ఏ గ్రహచారం, విగ్రహం స్థం నె నెంచె య్యాను? నీకు ఊహ నే నెక్కడ్నించి తెచ్చిపెట్టనూ! అనగా హకి అర్హత ఏడలాలి. కవిసమయాలూ సంప్రదాయాలూ తెలి యాలి.

శే—తెలుసును.

ఆ—ఇష్టం ఉండాలి. రసికత్వం ఉండాలి. అసూయ కూడ దు. ఇన్ని సరిగ్గా ఉన్నా భావం తెలియకపోతే, ఈ కవిత్వా నికి ఇన్నినీళ్లు వదులుకో.

శే—తిలోదకమా? అబ్బే! అప్పుడే? ఉండు. వెనకాముం దూ ఆలోచించనీమకే! నువ్వనేది బాగానే ఉంది. నాకు భావం

ఆస్వాదించేశక్తి లేదనికాదూ? కావచ్చును నీశక్తియందు. నాభావయిత్రీశక్తి తక్కువ కావచ్చును!

ఆ—కావచ్చేమిటే, రూఢి! నువ్వు ఇంకా కొన్నేళ్లు తంటాలుపడితేగాని ఈకవిత్వపు అంతస్థుకి ఎగగ్లేవ్. అల్లా ఎగింతేగాని నీకిది తెలియదు.

శే—కాని, నీలో రెండుతికమకలు ఉండి ఉండవచ్చు. నీ ఆలోచనలోనూ, నీ రచనలోనూ...

ఆ—గ్రహింపులేకని తెగేసి ఒప్పుగుంటూ, పైపెచ్చు తప్పులుకూడా ఎంచకుమరి! నాలాంటివాడి అఖండాలోచనకి తప్పులు టూ ఉండడమూనూ నీలాంటివాడు ఎంచడమూనా? దశా, కశ!

శే—నీ ఆలోచన స్పష్టంగా ఉండదేమో!

ఆ—ఉండకేం!

శే—సక్రమంగానూ సరళంగానూ ఉండదేమో!

ఆ—ఉండకేం!

శే—సమగ్రం కాదేమో!

ఆ—కాకేం?

శే—అన్నీ సరిగ్గా ఉంటే, ఎవడికో ఓడికేనా, ఎప్పుడోప్పుడు బోధపడితీరాలి ఎవ్వైనాసరే. కాక, నీ ఆలోచనని పూర్తిగా బయటపెట్టేరచన కాదేమో నువ్వు ప్రపంచానికి పారేస్తున్నది?

ఆ—నీకు వెంటనే బోధపడితేగాని ఒకరచనలో సరియైన

ఆలోచనే లేదన్న మాటా?

శే—ఎవరి నైత్రి గాట ఆడావ్?

ఆ—ఏపు చేత కాదా? నేర్చుకోవాలా?

శే—ఎల్లా గ్రహించావ్?

ఆ—కవిత్వాన్ని నువ్వు 'భావకవిత్వం', 'అభావకవి
త్వం', 'ముభావకవిత్వం' అన్నావూ! ఇంకా తేలిగ్గా 'భావకవిత్వం'
అనికూడా అన్నావుట! అక్కడికి భావ ఏమవుతాదో తెలుసా?

శే—అందుకే నాన్నగారికే అవుతాడు! అన్నీ నువ్వే అను
కుంటున్నావు. ఏ పచ్చ వార్తల్లో ఉండే అసంస్కారాన్ని చూ
సుకోడమే కష్టంగదా, పైగా నువ్వు వెళ్ళి సంగతులు కనుక్కొని
అసందర్భాలు పెంచుకోడం ఎందుకు? నాకు తెలియుంది ప్రతీదీ
కవిత్వం కాదు అనుకునే మూర్ఖత్వంలో నేను ఇంకా పడలేదు.
నాకు తెలియకపోతే, ప్రాజ్ఞులు, కోవిజ్ఞులు, అనుభవజ్ఞులు,
రసజ్ఞులు ఉన్నారుగా! నిఘంటువులు ఉన్నాయిగా! పలు
ముఖాలా చూసి ఎక్కడా సాయం దొరక్కపోతే ఏమవు
తుందోగాని ఈలోపల తొందరపడి ప్రతీదీ కొట్టిపారేస్తున్నావు.
కవిత్వకళకి ఉన్న ప్రత్యేకలక్షణం ఒకటి గమనించాలి. మనకి
దాని సారస్యం గ్రహించేపాటి తాఖతు లేకపోయినా అందు
లో మాటలకి అర్థాలంటూ తగులడి ఉంటాయిగనక, సాహి
త్యంలో మాటలకి లోకంలో సిద్ధించిన అర్థాలు నిల్చిఉంటాయి
గనక, ఎల్లానో అవి సంపాదించి, మనం కూడా, కవియొక్క
హృదయసంస్పందంలో ప్రవేశించలేక పోతే అదే పోయె, అసమం

మనుషులకైనా వెళ్ళిపడవచ్చు. ఇల్లా వెళ్ళిపడడం గానంలోనూ చిత్ర రచనలోనూ శిల్పంలోనూ అంతగా వీల్లేదు. ఒక వేళ ఒక కవి రచించి, పద్యంయొక్క జీవసారస్యాలు గ్రహించినవాళ్లు భూగోళంమీద లేరనుకుందాం. పోనీ కవి ఉంటాడు. అతనికైనా తన కవిత్వపుమర్మం కొంతవరకైనా తెలిసి ఉండవా? ఇప్పుడు నేను నిన్ను మొహమాటపెడితే నీ పద్యానికి నువ్వు అర్థం చెప్పవా?

ఆ—అసలు అర్థాలు చెబుతూకూర్చోడం నేను ఒప్పను. కవిత్వం అనందించాలంటే ఏకలాటుగా ఆనందించాలిగాని, దాన్ని ముక్కముక్కలు చేస్తే దాని సొగసే పోతుంది. కవిత్వాన్ని చెక్కలు చేసేకన్నా, దానిని రక్షించి వదిలేసిన వచనమో ఎట్టు గుంటే మంచి దనుకుంటాను.

శే—నేను ఆస్వాదనలో ప్రథమదశగురించి మాట్లాడుతున్నాను, నువ్వు చరమదశగురించి చెబుతున్నావ్! ఆస్వాదన కూడా తెలిసినవాడవు నువ్వొక్కడవేనా?

ఆ—నా మనుస్సు చిన్నదైనా నా హృదయం అఘాతం.

శే—అందరికీ అంతే.

ఆ—నా హృదయం మరీనూ. ఒక్కొక్కప్పుడు మిక్కిలి పరవశంగా, ఒకవిధమైన ఆనందంగా, చెప్ప వీల్లేని ఒకానొక మోహనదశగా, నా మనస్సు అయిపోతుంది. అప్పుడు అమాంతంగా ఈప్రకృతిలో సశరీరంగా లీనంఅయిపోవాలని నాకుఉంటుంది. మళ్లీ పద్యం పూర్తిచెయ్యడంగోల ఉండబట్టి ఆగిపోతూంటాను.

శే—ఒక వేళ నీకు ఎదేనా స్త్రీయేమో విసంతా? హృదయకన్న ఆగిపోకూడదూ?

ఆ—పశ్చ్రాయులు అల్లా నేఇకవితో! దేకాన్ని సిస్తారు. కాం,నేను అట్టి సమయాల్లో పెట్టి, కీట్సు లాగ అయిపోతాను.

శే—వాళ్లెవరు?

ఆ—నాకుమల్లేనే చిన్నతనంలో...

శే—వాళ్లకిమల్లే నువ్వు అనుకుంటున్నావా? నీకుమల్లే వాళ్లు వెంక అనుకునేశారా?

ఆ—సరిగ్గా నాకుమల్లేనే వాళ్లు అనుకునేశారు పూర్వం!

శే—వాళ్లతో ఆట్సే ఆట్సే సాపత్యం తెచ్చుకోడం నీకు శ్రేయస్కరం కాదు. నువ్వనేదాన్నిబట్టి, చిన్నతనపు లక్షణం ఉంటేసరా కవిత్వరచనకి?

ఆ—నీబోటివాడు కాకుండా ఉంటేసరి! అప్పుడు నా మనస్సులో జరిగే పరివర్తనాలు అసలు మాటల్లో అనడానికి వీలే ఉండదు.

శే—పోనీ నువ్వు ఊరుకున్నావుగనకనా! ఊరుకోడానికి వీలుండదుగావును!

ఆ—అంత బ్రహ్మానందదాయకమైన ఆ నా చిత్తవృత్తిని నేనొక్కణ్ణే అనుభవించి ఊరుకుని పైకి అనకుండా ఉండడంఅనేది చాలా ఒంటెత్తుగా ఉంటుందేమో అని భయం. అంచేత యథాశక్తిగా మాటల్లో అది చెబుతూంటాను. నీఅంత తెలియనివాడికి అది బోధించడం అసాధ్యం.

శే—నువ్విచ్చి రాసింది తెలిసినవాడివా? నువ్వు పండితకవివా? పోనీ నాచన సోముడవే, గణపవరపు వేంకటకవి వే! ఏ పండితుడికీ ఇది తెలియదే! కొరుకుపడదే! ఇది బోధపడితేనే పండితుగావున నీ ఉద్దేశంలో! లేకపోతే పండితుడు కాడంటావు తీరిపోతుంది! నీ హృదయం సమీపించడానికి ఎంత పండితుడైన వెళ్లాలోకదా! నువ్విచ్చే పదాలు ఛేదించి అర్థంచూపుకుని అది సంప్రటిచేసుగ్గో కలవాడికి భావం పట్టాలా అక్కర్లేదా, నీకు ముందు పుట్టి ఉండడం నిజమేఅయితే? స్పష్టంగావం ఏదీ ఇతరులకి నీమాటల వల్ల పుట్టకూడదు అని రాసిఉండవు కద!

ఆ—నే చెప్పదలిచింది ఆ ముక్కల్లోనే చెప్పేశాను! అవి స్పష్టంగానే ఉన్నాయి.

శే—నువ్వు చెప్పదలిచినదానికీ చెప్పగలిగిందానికీ తేడా ఉందేమో? చెప్పేవాళ్లో లోట్లూ సమస్యలూమాత్రం స్పష్టంగా ఉన్నాయి.

ఆ—మెచ్చుకోవలసొస్తుందేమో అని భయపడే వాళ్ల మాట అల్లానే ఉంటుంది.

శే—నీ మాటలు జనాన్ని దగ్గిరికి లాక్కోవాలి.

ఆ—అనేకలవాళ్లు నావటి హృదయంగలవాళ్లు అవాలి.

శే—అచ్ఛంగా నీ నాటి సృజనం నీకే ఉంటుంది. దేశ కాలాలకి అతిక్రమణ గమనాలు ఉండడంచేత ప్రకృతిలో, నాటకపు సంగీతానికిలాగ "నన్సెమోర్" ఉండవ్!! నీ మాటలు బతికున్న మనుష్యులికి రావు. అ మకని ముందు మానవహృదయాల

ఏమిటో చూడు.

ఆ—మానవులసంగతి నాకెందుకు ? నా ఆనందంకోసం నేను రాసుగున్నాను, రాసుకుంటాను. కోకిల ఆనందం కోకిల పాడుకుంటుంది.

శే—కాకి ఆనందం కాకి కూసుగుంటుంది. కాని ఎవరికేనా చెవిసిగాని పడితే 'హుష్' అంటాను. నీయిష్టం వచ్చింది రాసి అట్టేపెట్టుగోక, అది నువ్వు ప్రచురించా వెందుకూ, ఇతరమానవులకోసం కాకపోతే ?

ఆ—నాయిష్టం; సకాలీనుల్లో ఎవరేనా మెచ్చుకోగలరేమో చూద్దాం పోనీ అని.

శే—'పోనీ' అంటే ?

ఆ—అంటేనా? "ఏ గతి రచియించిరేని సమకాలము వారలు మెచ్చరే కదా" అని ఎరుగుదును.

శే—మంచి కవిత్వంకూడా సమకాలంవాళ్లు మెచ్చకపోవచ్చు. అందుచేత విలోమంగా, సమకాలం వాళ్ళు మెచ్చుకోడానికిగాని, మరోటి చెయ్యడానికిగాని వీలు లేని స్థితిలో ఉండేదల్లా మంచికవిత్వం అనా నీ సిద్ధాంతం? మెప్పుఉండదని తెలిసి అచ్చెందుకు వేశావ్? అచ్చు పడిందల్లా శాశ్వతం అవుతుందని గావును నీఊహ. మానవహృదయాల్ని పట్టుగుని నిలవాలిగాని ఏదేనా, కాగితాన్నీ తాటాకునీ పట్టుగుకాదు. వేసం ఆదినించీ ప్రెస్సులోంచా వస్తా? ప్రపంచంలో కసిగల జనం ఉంటారు. దేనికేనా రచనకి విలవఉండి అవి వాళ్లని ఆకర్షిస్తే, వాళ్లు

కంఠపాఠంచేసి దాన్ని నిలబెడతారు.

ఆ—అర్థం తెలియకపోయినా వేదం కంఠతా పట్టడంలేదూ కొందరూ, అల్లానే నా కవిత్వం పడతారు.

శే—తమరికి అర్థం తెలియకపోయినా అర్థం తెలిసినవాళ్లు మానవరూపంలోకూడా కనిపిస్తూండడంవల్లా, అసలు దానికి అర్థంఅంటూ ఒకటి ఉండితీరడంవల్లా, తమ అల్పప్రజ్ఞతో ఆ అర్థం అవగాహన చేసుకోడానికి జీవితాలు చాలవేమో అనేభయం వల్లా, కొందరు కంఠతానేనా పడుతున్నారు.

ఆ—ఎవరో గట్టివాళ్లుండి నా కవిత్వం అంతే చేస్తారు. "విపులా చ పృథ్వీ" అన్నాడు భవభూతి.

శే—భవభూతి అన్నమాట ప్రతీఆషాఢభూతీకూడా అనడం మొదలెడితే, నువ్వు మాత్రం ఒప్పుకుంటావా? అతను ఎందుకు, ఏసందర్భంలో, ఏరీతిగా అన్నాడూ?

ఆ—నీకు మొండివాదనగాని, నువ్వనేమాట ఉంటేనీ?

శే—నువ్వురాసేది తెలిసేటట్టు, తెలియడానికి, తెలుసుగుని మరీరాస్తే బాగుంటుందని.

ఆ—ఎయ్యొ మూర్ఖుడా! తెలిసేటట్టు ప్రతీ పనికిమాలిన తెలుగువాడూ రాయగలడు. వెయ్యేళ్ళనించి తెలుగులో ఎంత మంది తెలిసేటట్టు రాయడంలేదుగనకా! నే వచ్చేదాకా ఒక్కడికైనా ఇలా రాయడం చేతయిందీ? కవిత్వంఅంటే అనేక రకాలది ఉంటుంది. కవిత్వం అనేమాటకి అర్థం పెరాయిస్తూ ఉంటుంది. ఈకవిత్వంలో సంగతి, వస్తువు, పదార్థం ఫలానాఅని

ఇదమిత్థం అని కవికే తెలియదు, కాని గొప్పభావం లోపల ఉంటుంది. "ఏమిటి దీనిమాట?" అంటూ చొప్పదంటు ప్రశ్నలు ఈ కవిత్వంలోనూ వెయ్యకూడదు, గానంలోనూ వెయ్య కూడదు.

శే—అందులో ఒకగొప్పభావం ఉంటుందా? లేక, ఉంది అని మనం ముందే అనుకోవాలా? అల్లా అనుకుంటే, భావం లేంది ఏదీ? అభావమూ?

ఆ—ఇటూ అటూగుడానూ! ఇక నే తెలుసు గోడం గురించా? నేను రచనసమయంలో సమాధిలో ఉంటాను.

శే—ఇప్పుడు స్పష్టార్థం ఇస్తున్నాయి నీ మాటలు! ఇట్లే సంగా ఉంటూ సమాధికర్థంఏమిటి నీకు?

ఆ—"ఏకాగ్రత" అన్నమాట. అప్పుడు నేను తన్మయత్వం చెంది ఉంటాను. గొప్పగొప్ప రవీంద్రాదులు అంతా అంతే. నాకప్పుడు మాటవులు జ్ఞప్తికి రారు. ఏం పదాలు పడ్డాయో, పడలేదో నాకూ తెలియదు. ఏదోపద్యం చక్కా-వస్తుంది. రచించి పారేస్తాను; బస్.

శే—అల్లాఅయితే, నీ అపూర్వోద్రేకంతో కూడిన నీ ఉత్కృష్టభావన చల్లారి, నీ అఖండాలోచనతో మిళితమై, నీ ఏమ్మకతత్వంలాంటిది ఇతరులకి కలిగించడానికి వీలైన సరిమభాషాసంపద జనించి, ఉచితభాషలో గడ్డకట్టి వెలిసే వరకూ ఆగకుండానే నీ రచన ప్రారంభిస్తావా ఏమిటి?

ఆ—ఓ. తక్షణం. అప్పుడే కవిత్వం వేడివేడిగా ఉండడం,

అసలు నా కవిత్వం శుద్ధదేశప్రయుక్త, రసధార. అందుకని దాన్ని వేరే తెలుగుమాటల్లో పెట్టలేం. ఇంకో భాషలోకి దాన్ని తర్జుమా చెయ్యడం అసాధ్యం.

శే—బాగా వేశావు. అర్థమై అఘోరిస్తేగా తర్జుమా తద్దినం! స్వభాషవాళ్ళల్లో పెద్దలకిగనక ఇది అభేద్యంగా ఉంటే, తర్జుమా తమాయి కలియుగంలో రాకపోవచ్చు.

ఆ—ఏమో, వచ్చినాసరే, మానినాసరే. రాయడం అవతల గిరవాటెయ్యడం నా పని. అర్థజ్ఞానం లేని వాళ్లు దాన్ని హేళనచేస్తారు నాకు లెక్కలేదు.

శే—అందుకనే నేనా ఇతరుల్ని అంత కసుక్కుని, నన్నింత అడిగావు?

ఆ—అందుకు కాదు మనుష్యులికి మాత్సర్యాలు ఎంతవర కుంటాయో చూస్తాం అని. హేళనకి హద్దుండాలి. నా కవిత్వం విని, కిక్కురుమనకుండా నోరెత్తకుండా ఆశ్చర్యపోవడంచేత, కొందరు జనానికి లోపల ఎంతెంత ముద్ద. వాళ్ళే అడ్డదిడ్డపు ప్రశ్నలు దీన్ని గురించి. పౌరుషం ఉంటే తమకుకూడా ఇల్లాంటిది రాసుకోగూడదమా? నువ్వు చెప్పగలిగితే ఇల్లాంటికవిత్వం చెప్పి చూస్తావూ!

శే—నేనా? శాస్త్రం చెప్పినట్టుంది. నా తరమా? నూటికో వెయ్యికో నీబోటివాడు ఉండవచ్చు.

ఆ—అంత అపరూపమైంది నేను చెప్పకూడదనా, నీ వాదం?

శే—రామరామ! అపరూపం కానిదికూడా చెప్పమనే!

తెలిసింతరవాతగాని అది అపరూపమో సామాన్యమో తెలియదు! ప్రతీ ఫుంతా తొక్కిచూడవలసిందే. అదోఫుంత!

ఆ—నేను భాషకి సేవచెయ్యడం నీకు అయిష్టము ?

శే—భాష ఏ ఒక్కడిసొమ్మూ కాదు. ప్రతీ మనిషీ భాష వాడతాడు. మామూలుగా మాట్లాడ్డంలోనే కొందరు 'ఆహా!' అనేటట్టు మాట్లాడతారు. అది భాషాసేవ కాదా? ఏదేనా కాగితంమీద రాసింతరవాతా ఏమిటి కవిత్వం అవడం? పత్రికకి రాసినవాళ్ళు మాత్రమేనా భాషాసేవ చేస్తూన్నది? రాయకక్కర్లేదు. భాష ఆడడం వాడడం అసలైన భాషాసేవ. అది జనం అంతా చేస్తున్నారు. వాళ్ళు కష్టపడి ఆర్జించింది నొల్లుకుని కవి తందే అంటున్నాడు. భాష సముద్రం లాంటిది. సముద్రంలో అట్టడుగున పడిపోకుండా పైపైకి తేలగలిగిన మంద్రపర్వతంలాంటి జ్ఞానాన్ని ఆధారంగా చేసుగుని సంగతి సందర్భాల్ని కవ్వంగా చేసుగుని నాలికలనే తాళ్ళతో, జనం అంతా కలిసి మథనంచెయ్యగా చెయ్యగా బయల్దేరే హాలాహలాన్ని లయకర్తకి వదిలేసి అమృతాన్ని మాత్రం తనకి చేతయినంత పట్టి నిలిపేవాణ్ణి కవిఅంటారు. కవి తనజీవితం అంతా ప్రజలు ఆడేమాటలు విని, తన ఆలోచన అంతా ఆ పదాలల్లో చేస్తే, తన భావాన్ని జనహృదయాలకి వీలైనంత తక్కువశ్రమతో పాకించవచ్చు. కవి ప్రతిభగలవాడుగనక, ప్రజలభాష నిమిషంలో పట్టగలడు. కాని, కవి వాడినభాష యావత్తూ ప్రజలకందరికీ అబ్బడంఅనేది ఓపట్టాన్ని ఉండదు. ఒకవేళ ఆ కవి

అఖండుడైతే అబ్బవచ్చు. అప్పుడేనా విశేషకాలం పడుతుంది. అందుకని భాషా సేవగురించి ప్రసంగంలో ఒకవ్యక్తి చెయ్య గలిగినపని మాత్రమే చెప్పడం అవసరం! అందులో, నీ భాష వింతభాషకూడానూ!

ఆ—నాకు మామూలు సందర్భాలు తగుల్తూంటే నేను మామూలు భాషలో రాసేసి ఉండేవాణ్ణి. నాకు తారసిల్లేవన్నీ వింతసందర్భాలూ కొత్తసంఘటనలూనూ! పైట్టక కవిసమ యాలూ భాషాకూడా వింతగా ఉండాలి మరి, నే నెం జెయ్యను?

శే—సందర్భాలూ సంఘటనలూ ఎంత వింత రకంవేనా కావచ్చు. అవి, పైకి చెప్పుకోగలిగిన. వ్యక్తి వ్యక్తికీ వేరు వేరుగాకుడా ఉండచ్చు. కాని ఎల్లాంటి పరిస్థితుల్లోనేనాసరే, ఎవడైనా ఒకమానవుడు, అనగా శిలావిగ్రహంకానివాడు, తన భావ వాడు, ఎట్లా ఎట్లా ఆలోచించిఉండేవాడో అట్లా ఆలో చించి అప్పటి చిత్తవృత్తిని మాటల్లో బంధించేవాడే కవి. అందుచేతే, ఎప్పుడో పూర్వం ఒక్కొక్క కవి రాయగా నిల్చి మనదాకా వచ్చిన పదాలవల్ల మనకి జనించేభావం మన మనస్సులోకుడా అనాదినించీ వాసంచేసిఉంటూ, అప్పుడు కవిచేత నిద్దట్లోంచి లేవకొట్టబడ్డట్టు కనిపిస్తుంది. నీకు వింత భాష బయల్దేరడానికి కారణం నీ స్వంతపైత్యం అయి ఉంటుంది. స్వంతపైత్యం స్వంతానికి ఖర్చుపెట్టుగోడం మంచిది గాని, దేశంమీాద రుద్దడం ధర్మమా?

ఆ—ఏమిటి నీమాటలూ? కుమిలిపోయిన హృదయంతో

మానవజీవితంయొక్క పునాదుల్లోంచి పైకంటూ ఉండే ప్రణయాది రహస్యాలు వెల్లగించి...

శే—ఒప్పుకున్నాం!

ఆ—నా సున్నితమైన మనస్సులో వాటిని భరించలేక...

శే—కావచ్చు!!

ఆ—మనస్సు విప్పి...

శే—విప్పి చెప్పాలనుకుని, భాషతో దాన్ని తాళం వేసేస్తున్నావ్. "ప్రకటయు గూఢయునునగు సరస్వతి" అన్నవాళ్ళిద్దర్నీ కూడా ఏమంటావో తెలియదు. ఏ తరం దాటింతరవాత ఎవళ్ళైనా ఏదేనా భావం తమదిదని ప్రకటిస్తే అదికూడా నీ పద్యాల గర్భంలో ఉందని పేచీకూడా పెడతావేమో!

ఆ—అన్నట్టు జ్ఞాపకం వచ్చింది. నేను ముందు ముందు శతాబ్దాల జనంకోసమే రాస్తూంటా!

శే—ఈమాట బాగుంది. వ్యాకరణాలూ నిఘంటువులూ ఎదురుగుండా పెట్టుకుని కొందరు కవిత్వం చెబుతారు. వాళ్లు రాసేవి గతించినవాళ్లకోసం. నువ్వు ముందుముందువాళ్లకోసం రాయి. "మనం మాట్లాడుకునేది ఓ తాటాకుగ్రంథంమీద రాసి పారేశామంటే ఓ రెండువందల యేళ్ళయేసరికి ఓ టాంబా కోపనిషత్ అవుతుంది" అన్న గిరీశం మాటలు నీకు శరణ్యం గావును! బతికున్న కవులు కొందరైనా అట్లా వెనకాముందూ చూడగలవాళ్ళున్నారు నయమే. కాని, బతికున్నవాళ్ళ కోసం కూడా రాయడం ధర్మం. ఒకరోజులో ప్రపంచం బోలెడు

సాగిపోతోంది. నిన్నటిచే ఈవేళ అక్కర్లేదు. ముందుముందు వాళ్ళకి మనమాటలు దిగదుడుపు కేనా పనికిరాకపోవచ్చు. బతికున్న వాళ్ళల్లో కొందరేనా హర్షిస్తే వాళ్ళు సఫలం అను కోడంలో ద్రోహం లేదు.

ఆ—ఇంత మీమాంసలో పడితే నువ్వు దమ్మిడీ మెత్తు రాయలేకుండాపోతావు చివరికి, జాగ్రత్త! నా కవిత్వం ప్రకృతిని అనుసరించి ఉంటుంది.

శే—అంటే!

ఆ—ప్రకృతికి అర్థంఏమిటి? ప్రపంచానికి అర్థంఏమిటి? జీవితానికి అర్థం ఏమిటి? ఏదో ఉంటుంది, ఉండితీరాలి, మనం చెప్పలేం! అల్లానే నా కవిత్వంకూడానూ! ఇదీ, ఒక మిథ్య. పురుషుడికిమల్లే ఇదీ అవాఙ్మానసగోచరం!

శే—అగమ్యగోచరం! అల్లానేకానీ. ఎవరిఇష్టం వారిది. నీ ముందుముందే మనకొంపకొద్దీ ఇంత అవతలిసొచ్చింది.

ఆ—అర్థం అయేటా లేకో, తిట్టడానికో దీవించడానికో, ఎందుకైతేం నువ్వుకొంతసేపు నా మాటలుచెప్పుచ్చుకు కూచోడమే నాజన్మకి సార్థకం! నీవంటివాళ్ళు మనసులుకుపు నామా టల్లో అర్థంలేదని గోలచేసినకొద్దీ నాకు సంతసం. ఎల్లాఅయి తేం, నా మాటలకి ఒక విధమైన వ్యక్తిత్వం ఏర్పడుతుంది. అంతేగా ఎవరు కోరుకున్నా!

శే—నిందాస్తుతులు నీకున మంగసక సమస్కారం. అయి నా, నీ మాటలున్న కాగితం పట్టుగుని ప్రతీవాడూ నీ దగ్గిరికి

రాదుకదా!

ఆ—వచ్చినా లాభంలేదు.

శే—పసపిమసిపిగ్గిరకీ నువ్వా వెళ్ళలేవుకదా!

ఆ—వెళ్ళను!-నా కేంపనీ!

శే—ఈ మాటలఅర్థం ఏమిటి అని నిన్ను, కూడదని తెలిసీ, అడిగాను. ఒక వేళనువ్వు చెప్పగలిగిఉన్నా అది ఒప్పుకోకపోయే వాణ్ణే. ఎంచేతంటే, చెప్పదలచింది ఆముక్కలు చెప్పాలిగాని నువ్వుకాదు. నువ్వైతే, అందులో లేనిపదాలు కొన్నిసర్దడం, ఈ పదాలుచూసినప్పుడు పండితుడైనవాడికికూడా స్ఫురించని కమామీషులు కొన్నిజొనపడం లాంటి గారడీలుచేసి ఏదో అర్థంతియ్యొచ్చు.

ఆ—అసలునేను పద్యం పాడేసరికి నన్ను అర్థమే అడగరు.

శే—క్షమించు. పద్యంలో ఉండగల కవిత్వానికి, అగమ్యత్వం మొదటిపూత! రాగాలుతియ్యడం రెండోపూత!!. సగం వినపడి కడంసగం వినిపించకుండా మింగెయ్యడం మూడో పూత!!! పూతమెరుగులు కవిత్వంకిందకి రావు. ఎల్లానో జనాన్ని ఆకర్షించడంకాదు నీ పని; ఆకర్షణ సక్రమంగానూ, సవ్యంగానూ ఉండాలి. పాత్రప్రతిష్ఠచేసి ఆకర్షించు. మొదటే నువ్వు అతీతుడవని బయల్దేరకు.

ఆ—జనం అంతా మూర్ఖులు. నే నేంజెయ్యను?

శే—మూర్ఖుల్ని ప్రేమించు. వాళ్ళని హడలగొట్టకు. ఎవర్ని ఉద్దేశించి రాస్తావో వాళ్ళసంగతి గమనించు. వాళ్ళభా-

వస్తాడు. వాళ్ల అంతస్థులో చేరు.

ఆ—పోదూ! నేను కవిని. కవిత్వం చెబుతాను.

శే—నువ్వు మాటలు చెప్పు. అవి వెళ్ళి జనాన్ని ఆకర్షించేటట్టు చూడు. అప్పుడు అవి కవిత్వం అని జనం అంటే, నువ్వు కూడా అనుకో. కాలమే కవిత్వాన్ని నిర్ణయిస్తుంది.

ఆ—మన తెలివి అవతలవాడికి ఏమీ తెలియదు అజ్ఞానంలోనే ఉంటోంది.

శే—ఎక్కువన్నా సరే, అసలుండేను పోతాను.

(అని నిష్క్రమిస్తాడు. తెర. )

---

## వే షం త గా దా

[సభనిమిత్తం సరంజాం అయి ఉంటుంది. వేదిక. దానిమీద అధ్యక్షులవారికి ఒక కుర్చీ. బల్ల. దానిమీద నల్లగుడ్డ. రెండు దీపపు స్తాండులు. ఎదట చాపలూ, తివాసీలూ, బెంచీలూ, కర్రకుర్చీలూ వగైరా. జనం కూర్చునిఉంటారు. కొందరు వస్తూంటారు. శేషు, ఆనందం, సభాపతి, భావరాజు, రత్న శాస్త్రివగైరాలు వారిలో నాయకులు. ఉపన్యాసకుడైన బల వంతరావు వస్తాడు. కార్యదర్శి ఆయన్ని, నమస్కరించి, ఒక కుర్చీ చూపెట్టి గౌరవిస్తాడు. సంగీత రావు దర్జాగా వస్తాడు.]

ఆనం: రావోయ్, రా. (అని తనపక్క ఖాళీచేస్తాడు).

సంగీ: (వెళ్ళి అక్కడ కూచుంటాడు).

శాస్త్రి : శాస్త్రదర్శిగారూ! అధ్యక్షులు, బసలోంచి బయల్దేరినట్లేనా?

శాస్త్ర : చిత్తం ఏం అల్లా అడిగారు? అని తెలియకుండా కంటె వారే వుంచొస్తారు.

శాస్త్రి : ఏమీ లేదు, వచ్చింతరవాత జరగవలసిన లాంఛనాలూ దానాదీనా సభ ప్రారంభించే సరికి ఆలస్యం అయిపోతుందేమోనని.

సంగి : కాదు

శాస్త్రి : ఏడిసినట్టే ఉంది. ఈ సభకి ఈ రోజున ఫలానా వారు అధ్యక్షత వహించాలని ఉపపాదించడం వగైరాలు జరక్కుండానే అధ్యక్షుడు వెళ్లి కుర్చీలో కూచుంటాడా?

సంగి : సర్వమూ ముందే స్థిరపడిపోయి నవరసరావుగారు అధ్యక్షుడు అని అందరికీ తెలిసే ఉన్నప్పుడు ఆయన ఇల్లా వస్తూనే అల్లా వెళ్ళి కుర్చీలో కూర్చోవచ్చులెండి. తమరు ఊరుకోండి. తమకు "ఎట్టికెట్టు" తెలియదు.

శాస్త్రి : ఏమో! ఆ వెధవటికెట్టు నాకు తెలియదు.

[కారు చప్పుడు వినబడుతుంది. కారు ఆగినట్టవుతుంది. అధ్యక్షుడైన నవరసరావుగారు వస్తూంటే శాస్త్రదర్శి వగైరాలు ఎదురుకోలు ఇస్తారు. ఆయన చిరునవ్వుతో వెళ్ళి గబగబా వేదిక ఎక్కి అగ్రాసనాధిపత్యం వహిస్తారు. శాస్త్రదర్శి ఆయన మెళ్ళో దండవెయ్యగానే ఆయన దాన్ని ముళ్ళకంచె తీసేసినట్టు తీసి బల్లమీద పెడతారు. అందరూ చప్పట్లుకొడతారు.

నవరసరావుగారు ఒకసోడా తీసుకుంటారు. తరవాత ఆయన తనఎదట బల్లమీద పెట్టిఉన్న కాగితపుముక్క తీసి, సులోచనాలు తుడిచి, పెట్టుకుని, చూసి, సకిలించి, లేచి]

నవ: కార్యక్రమములో, అనగా ఈ ప్రణాళికలో, మొదటి అంశము దైవప్రార్థన.

[అని చెప్పి కూర్చుంటారు. శాస్త్రి సంగీతరావు కేసి చూసి తల ఎగరేస్తారు. సంగీతరావు వేదిక దగ్గరకి వెళ్ళి నిలబడి, కళ్ళు మూసుకుని, చేతులు జోడించి, గొంతుక సర్దుకుంటారు.]

శాస్త్రి; అంతా లేచి నిలబడడం ధర్మం మరి.

[ఎవడో ఒకడు అల్లా పైకి అనేసినతరవాత బాగుండదని చెప్పేసి కొందరు లేచీ, కొందరు సగంలేచీ, చాటువాళ్ళు కూర్చునీ, కొందరు పక్కవాళ్ళని పట్టుకువేళ్ళాడీ ఎల్లానో ఇవుతారు.]

సంగీ: "నిటలాక్షుం డిపు డెత్తివచ్చినను రానీ..."

[అనేది పూరికల్యాణిలో పాడబోగా నలుగురూ పకాలుమంటారు.]

శాస్త్రి : (సంగీతరావుదగ్గర కెళ్ళి అతడిచెవిలో, తెలుగుని ప్రార్థనేమిటి నీమొహం? దేవుడికి తెలుగురాదు. సంస్కృతాన్నికానీ !

సంగీ: (కొంచెం కోపం నటించి) "వృక్షాగ్రవాసీ...న చ పక్షిరాజీ..."

[అనేది ప్రారంభించినా అందరూ గోలగానే వర్తిస్తారు. సంగీతరావుకి చాలా కోపంవస్తుంది.]

నవ: (కలగచేసుకోకపోతే బాగుండదని) కార్యదర్శిగారూ! ఇదంతయు మున్ముందే నిష్కర్ష చేసి యుండవలసినదే!

ఆనం : 'జనగణమన' పాడవోయ్!

శేషు ; అందులో "ఆంధ్ర" అనేమాటగాని, కృష్ణా గోదావరీల స్మరణగాని లేదు, కనక వద్దు.

భావ : 'వందేమాతరం' పాడండి.

శాస్త్రి : దేవుణ్ణిగురించి అయితే 'వందేపితరం' పాడాలి

భా : 'పితరం' అంటే మాత్రలు చెడతాయి.

శాస్త్రి : 'మాతరం' అంటే గోత్రాలు విడతాయి.

నవ : (కొంచెం తీవ్రంగా) అయ్యా! ఇదె నా శాసన! సంగీతరావుగారూ! తమరు తమచిత్తమునకు వచ్చిన దైవప్రార్థన మాకు చేసి పెట్టుడు.

సంగీ: చిత్తం. కాని, శృతి లేదు గనక నేను పాడనే పాడను, క్షమించాలి.

కార్య : పోనీ నువ్వే రావోయ్! ఆనందం !

శేషు : చచ్చాం ! ఆనందం వస్తే అతని పదసంపుటికి అర్థం బోధపడదు.

శాస్త్రి: దేవుడికి గానంతోపాటు అదీ బోధపడి తీరుతుంది.

నవ: ఆర్యులారా ! ఇట్టి పరిస్థితులలో నేను ఏదైనా చర్య తీసికొనవలయు.

భాగ: (గబగబా వచ్చి) "జయ జయ జగన్నాథ! జగజ్జనన స్థితిసంహారకర! సనాతన! శాశ్వత! విశ్వతోముఖ! నిర్వికల్ప! నిరాకార! అదిగ్దేశకాలావ్యవచ్ఛేద్యవిభు! ఆదిమధ్యాంతశూన్య! అవ్యయ! అవాప్తసకలకామ్య! అనంత! అద్వితీయ! నిరస్తసమస్తోపాధిక సచ్చిదానందస్వరూప! నమస్తే నమస్తే నమః".

[అని లయ లేకుండా పాడతాడు, అంతా కూచుంటారు.]

నవ: లేచి కాగితం చూస్తూ) తరువాత విషయము అధ్యక్షుని ప్రారంభోపన్యాసము.

[అని చదివి, కొంచెం మొగమాటం అభినయించి, చిరునవ్వు నవ్వి, బల్లమీంది స్టాండు కొంచెం జరిపి మళ్లీ అసలుచోట పెట్టి దండలు కట్టుగుని]

నవ: సభ్యులారా! ప్రస్తుతపరిస్థితులలో నేటిదినము ఈపురమున మీ సంఘముతరపున ఈ సభ ఇంత జయప్రదముగ జరుగుట మిక్కిలి గొప్పసంగతి.

శాస్త్రి: అప్పుడే!

నవ: ఈ సంఘకార్యదర్శి నన్నిచ్చటకు ఆహ్వానమొనర్చుటలో నాయెడ చూపిన ఆదరణయు, నాకు చేసిన మర్యాదయు (జేబుల్లో చేతులు) ఎంతయు శ్లాఘాపాత్రములు. యువకులింతపట్టుదల చూపుచుండ వెనుకంజవేయుట పిరికితనమని నేను నా అధ్యక్షత్వమునకు వల్లె యంటినిగాని వేఱొండుకాదు. (సులోచనాలు తీసి కుడిచేత్తో పట్టుగుని) ఇదివరలో ఈ కుర్చీ అలంకరించుచుండెడివారు అపార ప్రజ్ఞావంతులు, అగణిత శే

ముషీ ధురంధరులు. వారి మేధకును నా మేధకును హస్తిమశ కాంతరము కలదు. ఆ కారణమును బురస్కరించుకొని సిగ్గు చెందుట మానవ ధర్మ విరుద్ధమని యోజించి, ఉన్నత కరములతో కరములతో, కార్యసానుకూలము చేయవచ్చునుగదా యని నిశ్చితిని. చాలమంది అభ్యర్థులు తమ ప్రారంభోపన్యాసము అంత్యమున చేయుదురు; అనగా వారు మొదట నేమియు చెప్పక, అంతయును చివరకు దాచి యిచ్చెదము అని వాగ్దానము చేయుదురు. అట్లు చేయుటవలన రెండులాభములు కలవు.

సంగీ: (శాస్త్రితో మెల్లిగా) అట్లు చేయడంవల్ల ఒకలాభం తెలుస్తున్నదం. రెండో దేమిటి?

సవ : అయ్యా! "ఎట్టికెట్టు" లేనిదే, నేను చెప్పజాలను.

శాస్త్రి—(సంగీతరావుతో) అయిందా! నీకుమాత్రం ఎక్కడేడిసింది ఆ టికెట్టు?

సవ—మొదటి దేది యన, ప్రస్తుతవిషయములో లోగడ తనకు ఏవిధమైన తయారీ లేకపోయినను, అప్పట్లో ఇతర ప్రసంగములు వినుచుండుట తటస్థించుట కాబట్టి కొండొకచో అవి తెలిసినచో వానిలోని ఘాటుభావములకు విరుగుడు పెట్టుచు, క్రూరభాషణములను దువ్వియు, ఖండభావములను పూరించియు, సమధానము చెప్పవచ్చు. రెండవ దేది యన ఒకవేళ ఇతరులమాటలు జాగ్రత్తగ వినినను, అవగాహన కానప్పుడు, తన అభిప్రాయము పరియభిప్రాయముతో నేకీ

భవించె ననియు, ఆ అభిప్రాయము గుణగ్రహణ పారీణులగు సభ్యులకు తెల్లమే కదా యనియు, దానిని మరల ఏకరువు పెట్టుట చర్విత చర్వణ మనియు అనుకొని సభ చాలింప వచ్చును.

శేషు—అవును. ఆనందంలాంటివార్ల భావోపన్యాసాలు తెలియవ్ ?

సవ—అట్టికారణములవల్ల నెంతమాత్రమును కాకపోయి నను మీరందరంతోనైననేమి, నేటి ఉపన్యాసకులగు బలవంత రావుగారి విలువగలవాక్యములను వినుటకుగాను మీమనముల దళుకొత్తుచున్న కౌతూహలములవలననైననేమి, మఱి యితర కారణములవలననైననేమి, నేనింతటితో ప్రస్తుతము విరమించి, మించి, బలవంతరావుగారిని 'వేషము' అనెడి విషయమును గురించి, తమఉపన్యాసమును ప్రారంభించవలసినదిగా కోరు చున్నాడ.

[అని నవనీనరావుగారు కుర్చీలో కూచుంటే, సులోచనాలు నుదుటిమీద పెట్టుకోగా, కంఠయ్య విసనలు వేస్తుతుంది. ఆయన సోడా తాగుతాడు. బలవంతరావు వేదికమీదికి వస్తాడు.]

బల—మిస్టర్ ప్రెసిడెంట్,

కొందరు—తెలుగు, తెలుగు ఓసీ, తెలుగు ప్లీజ్.

శాస్త్రి—సాంస్క్రిట్, సంస్క్రిట్.

ఆనం—పారా హుషార్ !

బల—లేడీస్ ! అండ్, జెం—

నవ—(తేచి ఉపన్యాసకునితో) ఆగు డాగుడు. ఏమండీ కార్యదర్శిగారూ?

కార్య—(వస్తూ) చిత్తం.

నవ—ముందు వారితో ఉపన్యాసం బాంధ్ధంబుననే యని ఏర్పాటుగ చెప్పకపోతిరా!

కార్య—చెప్పానండి. చెప్తే వారు అప్పుడప్పుడు మాత్రం ఆంగ్లపదాలూ, ఆంగ్లఇడియాలూ ఆంగ్లసంప్రదాయాలూ అప్రయత్నంగా దొర్లుతాయేమో గాని, ఆంధ్రాన్నే ప్రసంగిస్తానన్నారు. దానికేమండి, ఆమాత్రం అడ్డమైనవాళ్లకీ దొర్లుతున్నాయి అనేశాను. కాని వారు తోడుతూ మజ్జిగపోసుగున్నట్టు మొదణ్ణించీ ఇల్లా చేస్తారని నేను అనుకోలేదు.

సభా—అల్లాయితే ఈ సంగతి వోటుకి పెట్టండి.

నవ—మీ రిక్కడకు వచ్చి అదేదో తీర్మానపూర్వకముగా ముమ్ముందు శ్రుతపరపుడు.

సభా—ఇవేమన్నా కోర్టు కెక్కుతాయనా మీ భయం? పోనీ అల్లానే చేస్తాను.

"బలవంతరావుగారు 'వేషం' అనే విషయం గురించి తెలుగులో ఉపన్యసించాలని ఈ సభవారి ప్రార్థన."

శేషు—ఈ ప్రతిపాదనని నేను బలపరుస్తున్నాను.

నవ—ఎవరికైనను ఆక్షేపణ ఉన్నదా? లేక ఈ మాటలిట్టులే యునిచి ఓటునకుం బెట్టనగునా!

సంగీ—కొద్దిగా సవరణ అవసరమండి. 'తెలుగులో' అనే

మాటకి పూర్వం- 'అర్థ భావ రసములు జారనీయ కుండా ఉచిత మైన సంగీతము కలుపుతూ' అనే ముక్కలు చేర్చాలి.

శాస్త్రి—మరో సవరణ మిక్కిలి అవసరం. 'తెలుగులో' అనేపదానికి వామభాగమందు "గ్రామ్య తెలుగు కానట్టి" అనేమాటలు వెయ్యాలి.

శేషు—"అగమ్య, అస్పష్ట, అనర్థ పదాలతో నిండియుండని" అనే పరతు "తెలుగులో" అనే మాటమీద పెట్టాలి.

భావ—అయ్యా! అందరికీ నమస్కారాలు. కొత్త సందర్భం మనకి ఘటిల్లినప్పుడు దాన్ని అవగాహన చేసుకోడం మన ధర్మం. మనస్వంత ప్రత్యేక విశేషాభిరుచులకి కొత్త సందర్భం అనుకూలమా ప్రతికూలమా అని మొదట్లోనే బెదిరి బేజారై పోవడం అజ్ఞానం. ఒకవిషయంలో మనకి ఉండగల శాస్త్రజ్ఞానమూ పట్టిగొల్పి మనకి సంబంధం లేని ప్రతీకొత్త సందర్భంలోనూ ముందుకి తోయ్యడంగాని, తత్ప్రకారమే ఆ కొత్తసందర్భంయావత్తూ నడవాలని పట్టుబట్టడంగాని చాదస్తం. ఎవరో ఉపన్యసించ రమ్మనడ మేమిటి, ఓట్లేమిటి! ప్రతీదానికీ ఓటే సాధనమా? ఒకానొకసభ ఒకరోజున జరపడమా, ఆపడమా అనేది ఓటుకి పెట్టారు, బాగుంది. ఒకాయన తనకి అప్పట్లో ఆకలి అవుతోందా లేదా అనే విషయం కడంవాళ్లు ఓటుకి పెట్టాలని కూచున్నాడు. ఒక పండితుడు ఒకానొకదినం బుధవారమా గురువారమా ఓటుకి పెడితేగాని ఆగ్రహాలు వస్తాయన్నాడు. వ్యాపారం అల్లా రాసీయక మీాకు ఇష్టం

అయితే ఆయన చెప్పే ముక్కలు నిజండి లేకపోతే ప్రయోజనంలేని చోటకూడా కర్రపిడిసూత్రాలు సంధించటం ఎందుకు కనక, తలో కిళ్లీ యిచ్చి జనాన్ని సాగనంపండి.

కార్య—(కిళ్లీలబుట్ట తెచ్చి కిళ్లీలు ఇస్తాడు.)

నవ—వీరు చెప్పినమాట బాగుగనే యున్నది. అబ్బా! ఇప్పుడు పెట్టితిరేమయా ఈ పెంన? కిళ్లీలూ! తృటికాల మాంగజాలకపోతిరే! ఈ మహాసభ యుండునో మానునో ఏ రెఱుంగుదురు?

కార్య—ఎల్లా అయినా ఇవ్వవలసిందేనండీ! మిగిలిపోతే ఇవన్నీ ఎం జేసుకోం?

నవ—సరియె. అటులే కానింము. ఏదియో ఇంచుకంత యైన "ప్రాణాయిస్వాహా" చెయుటకై గడెకాలమైన నేటివారు మనలేరు.

[అని కూచుంటాడు. సోడా తాగుతాడు.]

బల—సభాధ్యక్షా, సభ్యులారా! మీరు నాభాషగురించి తగాదా పడవద్దు. మీకార్యదర్శిగారు నన్ను ఆహ్వానించుట ఇంగ్లీషులోనే జరిపినాడు. నేను తెలుగులోనే అంగీకరించాను. ఆయన అప్పటి ధోరణిపట్టి ఇప్పటి ప్రసంగం ఆంగ్లంలో నేమో అని భ్రమించాను. ఒకతెలుగువాడు సాటితెలుగు వాడికి తనభావం ఇంగ్లీషులో చెప్పవలసిరావడం తెలుగువాళ్ళ అప్రతిష్ఠంగాని తెలుగుభాష ఔన్నత్యంగాని కాదు. తమభాషని తమరేవాడక ప్రపంచభాషల్లోకల్లా తెలుగుభాషేమిక్కిలి

గొప్పదని, ఇతరులు — అనగా తెలుగు తెలియవలసిన అవసరం లేనివాళ్లు — అంటున్నారని తమకు ఇంగ్లీషులో సంతోషించడం తప్ప తెలుగువాళ్ళు గర్వించవలసిన విషయం కాదు! నాకు తోచిన వెర్రిమొర్రి భావాలు కూడా నా తెలుగులోనే నేను చెప్పగలను. చెబుతాను.

భావ—వినుడు వినుడు.

శాస్త్రి—సరేకాని, ఇదా 'వేషం' మీద ఉపన్యాసం? నోటికి వచ్చిందల్లా చెప్పడమా?

బల—అయ్యా శాంతించండి. నేను భాషను గురించి అన్నాను. భాషఅనేది భావం దాల్చే వేషం. అందుకని నేను నా 'వేషం' యొక్క హద్దులు దాటలేను. భావం ఆంతర్యం, వేషం ప్రత్యక్షం! ప్రకృతి భగవంతుని వేషం. కాని, 'వేషం' అనేది మనం సాధారణంగా మనుష్యుల దుస్తులూ, మనుష్యుల అలంకారాలూ, మనుష్యుల ఆభరణాలూ గురించే వాడతాం గాని ప్రకృతిలోని స్వరూపాలను గురించి వాడం.

సంగీ—చాలా కప్రపిడిగా ఉంది.

శాస్త్రి—వేషం అంటూ పెట్టి మొట్టవేదాంతంలో పడ్డాడు.

బల—'వేషం' అనే పదానికి వాడకం విరివిగా ఉంది. 'పిడివేషాలు నా దగ్గిరా?', 'తప్పే వెర్రివెర్రి వేషాలెయ్యకు చితక పొడిచేను' 'వేషం మట్టుకి దర్జాగా ఉంది' లాంటి వాటిల్లో. వీటిల్లో 'వేషం' అనే మాటకి అలంకారం, టక్కుటెక్కుతనం లాంటి అర్థాలు స్ఫురిస్తాయి. అయితే 'విధవ వేషాలు' అనేమాట కూడా ఉంది.

శాస్త్రి—ఎంత ప్రాలుబ్ధం వచ్చిపడిందిరా దేవుడా! అన్నీ అప విత్రపు కూతలేనూ.

సభా—ఇంకా సంస్కృతంగా ఉంటేగాని ఆయనికి నచ్చదండి.

నవ—అయ్యా! ఈమాటు అసభ్యముగను, ఆటంకముగను వర్తించెడివారిని పంపివైచెద.

(అని కూచుని సోడా తాగుతాడు)

బల—ఛాని 'దొంగవేషాలు' అనే మాటకూడా ఉంది. అంత మాత్రాన్ని వేషం దొంగతనం ఒక్కటే అని మనం నమ్మకూడదు. ఎంచేతంటే దొంగాడు వేషం వేసుకోకపోవచ్చు, వేషం వేసుకున్న వాడు దొంగాడు కానక్కర్లేదు. వేషం అంటే అందరూ ఎరుగున్న దొంగతనం.

"పగలెల్ల నాటల బ్రమయించుచును, సందుగొందులెల్ల నెఱిం గికొనుచు, రేలు కన్నగాండ్రగుచు నగళ్లు ప్రవేశించి..." అని సూరన్న చెప్పింవాల్లోకూడా ఆ తేడా కనపడుతోంది. ఎట్వొచ్చీ అల్లాంటి దొంగతనాలు రాత్రెళ్లే అంటాడు సూరన్న. నేటికాలంలో కూడా "ఈరోజున పగటివేళే వేషంలో వచ్చి అన్యుడులాగ మీాకు కనిపిస్తాను నన్ను పోల్చండి" అని ముందే జనానికి నోటీసిచ్చి, అల్లా వచ్చి, ఎవరు ఎంత కళ్లెట్టుగుచి పగటి వేళ ప్రయత్నించినాకూడా గుర్తింపబడకుండా వర్తించిన మున్నం పీరయ్యగారిని మనం ఎరుగుదుం. అయితే సూరన్న...

ఆనం——అయ్యా! అధ్యక్షులవారు క్షమించాలి. ఒక చిన్న మనవి.

(బలవంతరావు కేసి తిరిగి) సూరన్న ఏమంటాడో పేరన్న ఏమని బోతాడో మాకక్కర్లేదండీ! మీరేమంటారో అదే కానీం డి. వారూ వీరూ చెప్పేసినదాంతో రచనలు కొట్టిపారేసినట్టు మీ ఉపన్యాసం దంచకండి మరి ?

బల—ఎవ రామాట్లాడుతూన్నదీ ?

శేషు—ఆనందంగా రండి. ఈయన కవిత్వంచేసేటప్పుడు తప్ప కడంఅప్పుడు భావం బోధపడేలాగే వ్యవహరిస్తారు.

ఆనం—వీరు శేషుగారండి. ఈయన రాసిందీ చేసిందీలేకు గాని ఉండడమే జరిగితే తప్పకుండా బోధపడుతుంది.

నవ : (లేచి) క్షమించవలె. పానకములో పుడకలకై వడి అడ్డువచ్చువారిమీద చర్యతీసుగొనక మరి ఆగ లేను. (బలవంతరావు తో) కానిండు.

[అని కూచుని సోడా తాగుతాడు.]

బల—ప్రస్తుతవిషయానికి సంబంధించిన పూర్వరచనలు తెలుసుకోడం నేరంకాదు సరిగదా తెలుసుకోకపోడం ద్రోహం. ఏమి ఉండేసిందో తెలిసి నప్పుడుగాని మనుష్యులకి ఇక ఏం ఉండాలో తెలియదు. పూర్వుల అనుభవం దూరంగా తోసి స్వతంత్రయత్నం మీదే ఆధారపడేమానవుడు తనజీవితం అంతా తనబుద్ధిబలం వెచ్చించి వెయ్యేళ్ల కిందట స్పష్టంగా గుర్తింపబడి రూపం తాల్చి ఉన్నసంగతే నేడు కని పెట్టడం దేవు డిచ్చిన బుద్ధిని సద్వినియోగం చెయ్యడంకిందికిరాదు. కాబట్టి క్షమించాలి. 'వేషం' అనేమాట ఇంకా ఇతరపద ప్రయోగాలు

లలో ఉంది. పగటి వేషం, భామవేషం, పంతులపటాణీవేషం, నాటక వేషం, వేషంవెయ్యడం ...అః!! ఒకడు, అసలు ఎవడో ముందు మనకు తెలిసిఉండి తరవాత బుద్ధిపూర్వకంగా ఇంకోడు లాగ మరొకడు కనపడగలిగి, ఆ ముఖకవళికలలో జనాన్ని - వీలైనంతమందిని - పట్టగలిగితే ఆ ఒకడు వేషం వెయ్యగల డన్నమాట. ఇన్ని జీవరాసుల్లోనూ ఒకరి వేషం ఇంకోరిది కాకపోడంవల్లే వేషధారణయొక్క అవసరం కలిగింది. కాని, వట్టి బాహ్యవేషం వేసుకున్నంతమాత్రాన్ని అన్యత్వం సిరూపణ కాదు.

శాస్త్రి—(ఆనందంతో గట్టిగా) సరే. వీడు నాటకాల ఖ్యాపతురోయ్.

నవ—(లేచి) ఎవరది ?

శాస్త్రి—నేనేనండి. మావాడితో ఏదో చెప్పాగున్నాను. తరవాత జ్ఞాపకంరాదేమో అని. ఇది పైవేటు.

నవ—రహస్యంబా! మేమును వింటిమే! సరి నిశ్శబ్దముగ మాత్ర ముండుడు. (బలవంతరావుతో) మీరు కానియ్యాడు.

(అని కూచుని సోడా తాగుతాడు).

బల—అంతర్యంలోకూడా అన్యత్వం సాధించుకున్నప్పుడు గాని వేషధారణానికి సార్థకత లేదు! తనమనస్సూ తనస్వత్వం తాత్కాలికంగా చంపేసుగుని, అన్యమైన ఒకానొక కల్పితపాత్ర యొక్కమనస్సూ, స్వత్వం, వేషం, భాషా తెలుసుగుని అనుభవించి తెచ్చి తనమీద పెట్టుగుని, అంతటితో ఆగక, అప్ప

-ట్లో ఉండే శ్రోతల్నీ ప్రేక్షకుల్నీ - "మనం అనుభవించుతూన్నది మనం ఎరుగుండగా ఇక్కడ ఉన్న ఫలానా వేషధారి అవస్థా, లేక కేవలకల్పితం అయి ఇక్కడ లేని ఫలానా పాత్రయొక్క అవస్థా అనే మిథ్యలో దింపి జీవితంయొక్క మిథ్యాత్వం అందరికీ చిటికెలో తమాషాగా బోధించగలగడంకంటె మానవజన్మ యొక్క సార్థకత మరోటి లేదు. ఆరీతిగా నటించడం మహా కార్యం.

శాస్త్రి—నాటకాల్లో తిరగడమా?

గు—వేషాలు వేసేవాళ్లలో పాడైపోయినవాళ్లూ, పాడైపోయి వేషాలేసేవాళ్లూ ఉంటారు. కాని, ఎన్ని విధాల తను పాడైనా ఎంత చెడ్డకుర్రనటుడైనా సరే మంచితనం గలిగి ఉంటాడు. మంచితనం మనస్సులో ఉండేగాని నటించడానికి మానవుడు వెళ్లనేవెళ్లడు. నటులలో పాడైనవాళ్లు కొందరుంటే నటేతరుల్లో పాడు చేసేవాళ్లు ఉంటూఉన్నారు. కాని, నా ప్రసంగం వ్యక్తులగురించి కాదు. కొందరి నటులకి ఇంకా అంతర్వేషంసంగతి తెలియలేదు. మనుష్యుణ్ణి అన్యుడుగా మారనీకుండా తనస్వత్వాన్నే స్థాపించి తనవ్యక్తిత్వాన్నే సిద్ధాంతంచేసే గానాన్ని — (అదీ మళ్లీ పావలారకం) —వదల్లేని నటులున్నారు. 'వేషం' అనేపదానికి అర్థం కొందరి చమడాకోటు దిగి వారిహృదయంలో ప్రవేశించలేదు. అంతర్వేషం మార్పుకోసం దానికి మానవుడి మనస్సు పెట్టిపుట్టింది. అంతర్యంలో మార్పులేకుండా ఊరికే బహిర్వేషం వెయ్యడం దొంగవేషం వెయ్యడం.

సభా—సభవారిమీద ఇద్దరు చాలా వేషాలు ప్రయోగిస్తున్నారు.

నవ—ఎవరది ?

శేషు—వారు సభాపతిగారు.

నవ—నిజమే ?

సభా—కాక పోడం ఏమిటి ? నేనే సభాపతిని.

నవ—కార్యదర్శి గారూ ! ఇదియా మీ వేషము ? మీ కుట్రయును.

శాస్త్రి—అధ్యక్షుడుకూడా ' వేషం'లో పడ్డాడు.

నవ—మీరు అసలు సభాపతిని వేరే ఉంచుకొని నన్ను కుర్చీ మాత్రునిచేసి ఇక్కడ నియమించితిరా ? అట్టిచో నే నేగెద. (అని వెళ్లబోతాడు.)

చాలామంది : రామరామా ! అది ఆయన పేరండీ!

నవ—(ఆగి, నవ్వుతూ) అటులనా ? రూఢియే ?

శాస్త్రి—అవునో కాదో టికెట్టు చూపెట్టమనండి.

సభా—లేకపోతే ఓటుకి పెట్టండి, తమదయ.

బల—ఆగ్రహిస్తే కార్యంలేదు. దయచెయ్యాలి.

శాస్త్రి—దయచెయ్యడంఅంటే ?

బల—(నవరసరావుతో) భుక్తం తమదేగా కూచోండి.

నవ—సరేత్వరగా తెమలుడు. ఇది ఇటులనే యేడ్చుచుండును.

[అని మళ్ళీ కుర్చీఅలంకరించి సోడా తాగుతాడు. అంతా చప్పట్లుకొడతారు.]

బల—జీవితంలో దిగంబరమత సిద్ధాంతులు ఏకొందరో ఉన్నా, చాలామంది మానవులు ఏదో వేషం వేసుకునే ఉంటారు. ఆవేషం దేశకాలపాత్రల స్థితి గతి వైపరీత్య స్వభావ ఆదర్శాలబట్టి ఉంటుంది. నాటకరంగంమీదికి పాత్ర ఏదో విశేష వేషంలో వెళ్ళాలా అక్కర్లేదా అనేది తంటా విషయమే. ఏదో కొత్తగా ఉండే వేషం భాషా అక్కర్లేదనేవాళ్ళు జ్ఞాని—'తస్యకార్యం న విద్యతే'. కొంత అదనపు వేషంతో అక్కడ నిలబడితేగాని మామూలుగానైనా ప్రేక్షకులకి అనిపించదనిన్నీ, జీవితంలో మామూలుగా ఉండే వేషంలో మాత్రమే రంగంమీద సిద్ధం అయితే, ఆ దృశ్యం, విశేషభావనాశక్తి లేని జనానికి పేలవంగా ఉండి పట్టివ్వదనిన్నీ, అన్యత్వస్ఫురణకీ తరతమ భావనిర్ణయానికీ విశేష వేషం దోహదం అనిన్నీ, కొందరు జ్ఞానుల విశ్వాసం. అందువల్ల, పాత్రయొక్క వయస్సుని బట్టి (—బాల్యాద్యవస్థలల్ని అనుసరించి), పాత్రయొక్క శాఖతును, బట్టి(—వర్ణ ఆశ్రమ ఉద్యోగధర్మాల్ని అనుసరించి), పాత్రయొక్క పరిస్థితుల్నిబట్టి (—ఆపాత్ర ఉన్నది గృహమా, ఆరామమా, దుర్గమా, ఆస్థానమా, అంతఃపురమా, అరణ్యమా, యుద్ధరంగమా, ఘంటాపథమా అనేదాన్ని అనుసరించి), పాత్రయొక్క కాలాన్నిబట్టి (—అదిభూతకాలం అయి ఫలానా అని తేల్తే ఆకాల భాగాన్ని గురించి వర్తమానకాలంలో జనానికి తెలిసినదాన్ని అనుసరించి), పాత్ర ఎవరి [illegible] భిన

యింపబడుతోందో ఆసభవారి విజ్ఞాన ఔన్నత్య అభిరుచుల్ని బట్టి, నాటకం ఆడించేవారంటూ ఉంటే వారి కృషిపరిశోధనలూ వారి కళాభిలాషా వారి సత్యస్థాపనాప్రియత్వమూ వారి ధనబలమూబట్టి, నాటకంఆడేవ కిరాయి నటుల క్షణిక సమాజం కాకపోడాన్నిబట్టి, ఉంటుంది, ఉండాలి. పైగా, ఆయా వేషాల వర్ణరూపాలు ప్రేక్షకులకి స్ఫురింప చెయ్యడమేగాని కావలసినదీ, ఆమట్టుగా ఉన్నబాపతో ఋణంతెచ్చిన బాపతో డబ్బోసి ఆ అసలుగుస్తులన్నీ కొనుక్కొచ్చి ఆపోడం కాదు! మరకలు విస్తారం అవడంవల్ల నాటక వేషధారణం తృప్తికరంగా ఉండదు. వృత్తినటుల్ని ఏమనీ కార్యంలేదు చాలాభాగం పురాణనాటకాలు. పురాణనాటకాలు రచించడంలో సదుపాయాలు లేకపోలేదు. నూతన పాత్రసృష్టి అవసరంలేదు. "ఈ నాటకమునందు వచ్చుపాత్రలు" అని శీర్షిక పెట్టేసరికి కావలసినంతమంది శివకేశవులంటి వాళ్ళపేర్లు ఆ పుస్తకంలో పాతుకుపోతాయి. వస్తువులభించినతరవాత పేరెట్టడం ప్రపంచంలో - వస. ఇక్కడ పేర్లుమాత్రం మొదటే దొరుకుతాయి, వాటితరవాత వస్తువులు పుట్టనే పుట్టవ్. కథాకల్పనా ప్రజ్ఞ అనవసరంలేదు. బాగుండకపోతే, లోగడే అల్లాఉంది సన్నింజెయ్యామన్నారు అనడానికి వీలుంది. మన దేవుళ్లు స్వయంగా నాటకరంగంమీదికి వెలిసి పావలాతో మనకి మోక్షం ఇచ్చేస్తారు. దొరికినకాడికి అదిమనం ఇంటికి పట్టుకుపోడమే తరవాయి అనే నమ్మ

కంతో నాటకానికి ఎగడే అంధజనాన్ని విరివిగా ఆకర్షించ వచ్చు. నేటి కాలపు సంగతులతో నాటకం అయితే వీధంట వెళ్ళే అడ్డమైనవాడూ దానియొక్క యోగ్యతాయోగ్యతలు తరిచి చూసి విలవకట్టేస్తాడుగాని, వీటై నంత పనకటి కథ గలదీ, కాలవిషయంలో అస్పష్టతగా ఉండేదీ, దేవుళ్ళుఆడే దీ లాంటిది అయితే ఎన్ని అసంధర్భాలు అందులో పోగుపడ్డా, 'వాళ్ళు మహిమగలవాళ్ళు గదా, ఈ వూరితోటలోనే, వెనక వాళ్ళు ఎందుకు ఉండి ఉండకూడదూ!' 'వాళ్ళు ఇచ్ఛారూపులు గదా, చమ్కీడ్రెస్సూ ఎలెక్ట్రిక్ బల్బూ కొనుక్కోడానికి వాళ్ళుమాత్రం ఎందుకు బదులుచేసి ఉండకూడదూ!' 'మనకే ఇంగ్లీషు వచ్చినప్పుడు దేవేంద్రుడుమాత్రం హిప్ హిప్ హు ర్రేలాంటి ఇంగ్లీషు ఎందుకు ఎరిగున్నవాడయి ఉండకూడదూ!' లాంటి సమర్థింపుల్లో ఎల్లాంటిచిక్కైనా విడగొట్టెయ్యొచ్చు! అదీగాక, నేటిసందర్భాలు పట్టిగెళ్ళి వాళ్ళకి ముడెట్టి అప్ప ట్లో వాళ్ళకిమాత్రం ఈ సమస్యలు ఎందుకు ఉండిఉండకూడదూ అనివాదించవచ్చు. ఘనపరిమాణమూ నృత్యగాన వాక్చేష్ట లూగల మనుష్యులు పాత్రలుగా రంగంమీదికి వచ్చిపోయే పురాణనాటకాలు బయుల్దేరింతరవాత ఆ పురాణ పాత్రల వేషాల చిక్కు తటస్థించింది. చారిత్రిక నాటకాల్లో శిల్పశాస్త్ర పదరచనల సాహాయ్యంవల్ల వేషంయొక్క పరిణామ వర్ణరూ పాలు జ్ఞానులు స్థిరపరుచుగోవచ్చు. సాంఘిక నాటకాల్లో మరీ స్పష్టంగా వేషనిర్ణయం జరగవచ్చు. పురాణపాత్రల వేషమే

తగాదా. వాళ్ళ వేషాలు పురాణనాటక కారులు ఎరుగుదు రేమోంకాని చెప్పరు. 'అంతట బ్రహ్మ ప్రవేశించును' అంటారు అంతే. ఏ తిట్లకో సిద్ధమై నటులే ఏదో ఏడుస్తారు. పురాణపాత్రలు ఆంధ్రనాటక పాత్రలుగా మారిపోడంలో నలిగి క్షుణ్ణంఅయిపోడం జరిగిందని తెలిసిన పండితులు గాఢపడి చెబుతూంటారు. జనరంజకత్వం- ఒక్కొక్కప్పుడు అపసవ్యమైన రకం- మనస్సులో పెట్టుగుని, నాటక కారుడో, నాటకంఆడించేవాడో నటుడో, మాట లందించేవాడో తెలిసో తెలియకో ఆ పుణ్యం కట్టుగుని ఉంటా డనుకుందాం. ఆ పాత్రలు నగపాలు దేవుళ్ళు, ఇమిటేషన్ దేవుళ్ళు, ఇప్పటి జపాన్ · డినుసూలాంటి చౌకబారు దేవుళ్ళు, దేవుళ్ళలాంటి మనుష్యులు, మనుష్యుల్లాంటి దేవుళ్ళు, శుద్ధ పచ్చి మనుష్య మాత్రులు - ఈరకం అయితే వాళ్ల పతనంగురించి ఎవ్వరైనా దుఃఖించడం అనవసరం. ఆ మాత్రం కష్టాలు ఎవరికేనా వస్తాయి. ఋషుల్ని గురించైనా చింతిల్లడం అనవరమే - ఎటొచ్చీ వాళ్లకి కాస్త జనపనారగడ్డలూ వాటి కంపూతప్ప ఇతరబాధ లేదు. మరీపెద్ద దేవుళ్ళకి మరీకష్టాలొచ్చాయి. ముఖ్యంగా బ్రహ్మ విష్ణు, శివుడు, వీళ్ల భార్యలు, నారదుడు. బ్రహ్మాదులు వరాలివ్వడంతప్ప ఇతరత్రా ఏమీ ఎరగని అమాయికులే. అయితేం, వీళ్ళని లాక్కొచ్చి నాటకకారులు వీళ్ళ వేషం వేయించితీరతారు. సాటిమానవుడి హృదయంగాని, స్వంత హృదయం గాని మానవుడికి బోధపడదే, వీళ్ళహృదయం నాటకకారు

శేష ఎల్లా తెలిసింది అంటే ఏమో తెలిస్తే తెలియనచ్చు. ఆదర్శంగా పెట్టుగుని ఆరాధించుగునేనిమిత్తం సామాన్య బుద్ధికి అతీతమైన సంకల్పాలతో ఉత్తమ లక్షణసముదాయాలకి మూర్తులుగా దేవుళ్ళని మానవులు భావనలో సృష్టించుగుంటారు. దైవసంపద గాని అసురసంపదగాని మానసిక లక్షణసన్ని వేశమేగాని స్థూలశరీర సంబంధి కాదు.

శాస్త్రి—ఓరిబాబో! పురాణనాటకాలు కూడవంటావా?

నవ—తమకు తరుణము ఇచ్చినప్పుడే తమరు మాట్లాడుడు.

సభా—వీరు తమకి తరుణంఇచ్చినప్పుడుమాత్రంతప్ప కడం ప్రతీఅప్పుడూ మాట్లాడకుండా ఎంతమాత్రం ఉండలేరు.

నవ—అయినయెడ చర్యతీసుకొనుట యూఢి.

శాస్త్రి—తమరు ఏం తీసుగున్నా నరే. బద్ధుణ్ణి.

[నవరసరావుగారు సోడా తీసుగుంటాడు.]

బల—ఆయా దేవుళ్ళనుగురించిన ఊహాలు శిలారూపంగాని చిత్రరూపంగాని ధరించి విగ్రహాలుగా గాని బొమ్మలు గాగాని మారి సంకుచితంఅయినా అవి వాగ్రహితం అవడంచేత మానవుల మన్ననకి పాత్రం అవుతూనే ఉన్నాయి. కాని, ఒక మనిషి—వాడికి ఎన్నిరాగాలొచ్చినానరే — దేవుడిరూపంలో వచ్చానంటూ మాట్లాడ్డం మొదలెడితే నవ్వొలాటే. అతిపవిత్ర విషయం ఆచరణలోకి దింపగా అతిఅపవిత్రంగా పరిణమించడం ఇదే. అసమర్థులైన నటులు దేవపాత్రధారణం చెయ్యగా చూసి మోసపడి నేను ఇట్లాఅంటున్నానని తమరు

అన్నీ తగాదాలే.

మోసపోవద్దు. వెయ్యవలసిన వేషం నుకే గొప్ప దేవుడిది అయిన కొద్దీ అందుకు మరీ నటేతరులుగాని అసలు అంగీకరించడు. అందుకనే కొత్తవాళ్ళకీ, పాటా రాక మాటా ఖణిగీబిణిగీ చెప్పలేని వాళ్ళకీ, ఏదో వేషం సరదా వాళ్ళకీ, అసలువాళ్లు దగా చెయ్యగా వూచీ గడిపేటందుకు వచ్చే ధర్మాత్ములకీ అవి సర్దుతారు. ఆఖరికి దేవుళ్ళ వేషాలికికూడా సన్నద్ధుల్ని తేవలిసొస్తే చచ్చే చెత్తువస్తుందని నాటకాలు ఆడించేవాళ్లు అంటారు. అయితే మహాత్తరంగానూ ఆచరణీయంగానూ ఉన్న పురాణగాధ సర్వజనవిదితంఅయి ఉంటుంద గనుక దాన్ని విసర్జించుకో నక్కర్లేదు. ఎందుకంటే కథ సృష్టింపడం అంటే మజాకా కాదుగనకనున్నూ, మనంసృష్టించేకథలు ఎల్లాఉంటాయో మనకి తెలుసు గనకనున్నూ. కాని పేర్లుమాత్రం పురాణంలోవి ఎత్తుగుని, వాటినిగురించి జన బాహుళ్యంలో ఎంతమాత్రమూ ప్రచారంలో లేని తికమకలు ఆ పేర్లతో జతపరిచి సంకరం చెయ్యడం అధర్మం. మార్పులు అవసరమే. దేనికేనా ఓదారీ, ఓ తెన్నూ, ఓనబబూ, ఓసంవత్సమూ, ఓక్రమమూ, ఓఅనుభవమూ, ఓనేర్పూ, ఓకూర్పూ, ఓపనివాడి తనమూ ఓబోధకత్వమూ ఉండాలి.

పురాణబ్రహ్మచతుర్ముఖుడు, వాగీశానపతుడు, సృష్టికర్త, వేదమూర్తి ...ఇల్లాగా భాసింపబడ్డవాడు. నాటకబ్రహ్మ సాధారణంగా యంబ్రహ్మ. ఒక్కొక్కప్పుడు తలకాయలుమాత్రం నాలుగుంటాయి. ఒకసారి ఆ పెట్టుడు తలకాయలు వేష

ధారి చెవులు మూసెయ్యడంవల్ల అతడికి ప్రాంప్టింగ్ అందక, ఆ బ్రహ్మఒక్కమాటకూడా ఆడలేకపోయాడు — వీడి వేదాలు బం గారంగానూ! ఒకసారి ఒక నాటకహిరణ్యాకశిపుడు పెద్దవచనం చదివి బ్రహ్మని వరాలు కోరుకోగా, బ్రహ్మ కనుసంజ్ఞలు చేసిచేసి, "సరే ఇచ్చితిని" అని తన పార్టు కాస్తాఅనక, వింగ్ లోవాళ్లకి విన పడేలాగు "నాకు పార్టు రాదు. నేను రైల్లో ఇప్పుడే వచ్చాను" అని హిరణ్యాకశిపుడితో అన్నాడు. పురాణవిష్ణువు, లోకస్థి తికరుడు, సర్వవ్యాపి, అవతారధారి, శేషశయనుడు,... ఇల్లా గ్గా ఊహింపబడ్డవాడు. నాటకవిష్ణువు ఏ ఒకటి రెండు లక్షణాలో కలవాడైవచ్చి ఊరుకోక మామూలుమనుష్యులకంటె హీనం గా ప్రసంగిస్తాడు. ఎంత సంగీతం వచ్చిన నటుడైనా అదేరకం. పురాణశివుడు అర్ధనారీశ్వరుడు, అనిలాత్ముడు, మంగళకరుడు, లోకసంహారి, తాండవమూర్తి... ఈలాగ సంకల్పించుకోబ డ్డవాడు. మనసాప్యస్పృశ్యుడు అని మహాకవి అభిప్రాయం. నాట కశివుడు త్రిశూలం గాని చందమామ గాని పాముగాని, దొరి కిన పరికరాలతో డబ్బైనా గడ్డంతో తయారు. 'శివశివా! నీ కెంత గతి పట్టిందిరా!' అని ప్రేక్షకులూ శ్రోతలూ అనుకునే టట్టుగా నాటకశివుడు సంభాషణవగైరాలు చేసి, తాండవం వగైరాలులేకుండానే పారిపోతాడు. పురాణఇంద్రుడే అసలుఒక అసందర్భపు కల్పన. ఆయనమీద ఎప్పుడూ విశ్వాసరాహిత్య మే. ఆయనపదవికి ఎప్పుడూ తవాయే. ఆయనకెప్పుడూ ఉల్లా సీదాభయమే. ఇతరులకష్ట చెడగొట్టాలని ఆయన ఎప్పుడూ

స్త్రీలని పంపడమే. నాటక ఇంద్రుడు ఎప్పుడూ సభ చెయ్యడమే. మామూలుసంగతులు ఎప్పుడూ ఇతరుల్ని అడగడమే. భోగ రాయుడు నక వారకోర్టులో ఎప్పుడూ బోగంఆటే. పైలై నంతపచ్చిగా ఆ మేళం జొనపడంనిమిత్తమే కొన్నినాటకాల్లో ఆ కోర్టు.నాటకఇంద్రుడు అయిదారు రాగాలు అనడం వచ్చిన వాడున్నూ చమ్కీ వేషం(—పువ్వులతో సహా—కళ్ళనిమిత్తం) తొడుక్కున్నవాడున్నూ అయితేనవ్వు తెప్పించడు. ఇంక పు రాణనారదుడు. ఈయన ఒక గొప్పకల్పన. "అధ్యాత్మవేదియుం గృపాళువునైన నారదుండు—పారదరుచి దేహుడు—అతుల భాగ్యోదయుడు-అపార దయామతి—వివేక విశారదుడు-ప్రా చీన బర్హికి ఆత్మతత్త్వ ముపదేశించినవాడు— ఈశ్వరదత్తమై బ్రహ్మాభివ్యంజకములైన స్వరప్తస్వరంబులు తనంతన మ్రోయుచున్న వీణాలంకృతిం జేసి నారాయణకథాగానంబు సేయువాడు- భగవంతుండగు నారదుండు" అని పోతన్న (— వ్యాసుడు) పొగిడిన భాగవతోత్తముడు, భక్తశిఖామణి. నాట కనారదుడు పరమ పాటిష్టి రకం. వాడివేషం—బొంబాయిజా పతుగావును— తలంతా బాగానున్నగా గన్వమెరుగు వచ్చే లాగు డెక్కించిఉండడం, వెనక్కి నిగిడే పిలక ఉండడం—అది అచ్చంగా ముచిగి శిలంగాఉన్న గంగాబొండం అనిపించడం! పాంకోళ్లు—వాయించని చిడతలు —చేతులో తీగలులేనివీణ (—పోతన్న రాసినవాన్ని పట్టి నారదుడు. నారదుడుదరించే మహతి వాసంతట అదే విష్ణుకీర్తనలు మోగుతుంది గనక

కొందరునటులు ఆసంగతి గ్రహించి తమ కర్రైకి తీగెలు లాగేసిఉంటారు), తీగెలున్నా చేత్తో ముట్టుగోరు; ముట్టుగున్నా ఒకచేత్తోనే శల్ల కిందులా వాయింపు. నాటకనారదుడు 'అగ్గిపెట్టెగాడు'ట. అందుకనే మాటలు వినిపించనిపాట పాడుతూ పాడుమన్ను చేస్తూంటాడు. పాడతాడని మనం క్షమించాలి. నాటకనారదుడు దేవుడూకాడు, ఋషీకాడు, మనుషీకాడు, మంచి రాక్షసుడూకాడు—ఒక టోరకమైన లుచ్ఛా. అటువంటివాణ్ణి, పట్టుబడితే, మామూలుగా తవ్వి పాతరేస్తారు. విశ్వప్రపంచమూ సత్యాధారం అనిన్నీ, సత్యం తెలియడంవల్ల కలహాలు ఎక్కువే అనిన్నీ సూచించడానికి పురాణనారదుడు కల్పించబడి ఉండవచ్చు రాగాలు మనకి లంచంగా ఇవ్వలేని నారదుణ్ణి నాటకంలో చూస్తే ఆపాత్ర ఎంత అపాత్రం అయిపోయిందో తెలుస్తుంది. ఇక లోకమాతలుగా ఊహించుకోబడ్డ లక్ష్మి, సరస్వతి, పార్వతులు. ఎవరో మాతలు ఆ రూపాలనేస్లెట్టుగుని కనిపించినప్పుడు దేవత్వపుస్ఫురణ ప్రేక్షకులకి అవుతుంది అనుకోడం హాస్యాస్పదం.

ఆనం—లేకపోతే మగళ్ళా ఏమిటి ఆడవేషం వెయ్యాడం? భ్రుకుంసుల్ని మీారు వెనకేసుగొస్తారుగావును!

బల—వెనకేసుకురాను. భయపడకండి. అయితే, కళలో శాసనంచెయ్యడ సాహసం అనిమాత్రం అంటాను. ఎంచేతంటే వ్యర్థం. భ్రుకుంసులైనా స్త్రీరసం ఒప్పించడంలో ప్రచారంలేని ఆ రోజుల్లోనే విశేషఖ్యాతి గాంచిన కీ. శే. జగ్గరాజుగార్ని

ఎరుగుదుం. నేను కృ గారం ఒలికించుతూన్న నరసింహారావు గార్ని ఎరుగుదుం. ఆ(భుకుంసుల్ని మించిన నటీమణులు రంగంమీద ఉన్నారేమో వెళిగాలి.

మొత్తానికి, పురాణంలో ఉన్నంతవరకు అల్లాంటి పాత్రలు జనంయొక్క భావనలో ఉండేవారు తీరిపోయేని. వాళ్లని నలుగురి ఎదటికీ మనిషివేషాల్లో ఈడ్చి వాళ్లచేత నిత్యకృత్యప్రసంగతులు మాట్లాడించే సరికి, నెం చాలా గొప్పవాడని పేరు మోగిపోడంచేత వాడి దర్శనభాషణలు జన్మతారకం అనుకుని వాణ్ణి ఆహ్వానించగా వాడు నోరు విప్పేసరికి "ఛాసె! వీడుట్రా" అనిపించేట్టు, నవ్వులాటగా తయారయింది. నాటకదేవుళ్లు పరిహాసానికి అనుకూలం అయిన సరుకుగా మారడం జరిగింది. ఇది మహోద్ధరణమా మోక్షప్రాప్తా ?

సం—అది భావనలేనివాళ్ళ దెబ్బలాట.

బల—ఇతరులు తమభావనతో అట్లా అనుకుని తీరాలి అని మీరు కోపపడితే, మేం భయపేసి అట్లానే అనుకోవలసివస్తుంది. అది కాదు పనివాడితనం. అదే ఇతరులకి అట్లా అనిపించాలి.

సంగీ—పోదూ ! పాట తిన్నగా పాడిచేసరి ! వేషంలో ఏముంది! మాటల్లో ఏముంది, పటుడు సంగీతం తియ్యుడంలో ఉంది.

బల—నాటకాలు గొప్పవైనప్పుడుగాని గొప్పనటులు పుట్టరు. ముందు నాటకకారుడూ, తరవాత నాటకాలూ, తరవాత నటులూ, అదీ క్రమం! ఏమైనా, దేవతలు తమకు ఏయే వేషంలో ప్రత్యక్షం జరిగారో ఆయొక్కవయినం, ప్రబంధకవుల్లాగ, నాటక

కారులు చెప్పడం నయం. పూనన పాత్రలవల్ల ప్రత్యక్షంలో సాధిం చడానికి వీలులేనంత అఖండం అయిన కార్యాలు నాటకకారు డి దృష్టిలో ఉండి దేవుణ్ణి రంగంమీదికి 'సమను' చెయ్యడం అతనికి తప్పనిసరి అయితే, ఆ నాటకకారుడు, ఆయా దేవుణ్ణి ఒకలిప్త కనపడమని తక్షణం అతడు అంతర్ధానం కావడానికి సెలవు ఇవ్వడమో, మాటలు పెట్టకుండా మొగ్గులాగ కనపడే టట్టు చేసి కాస్సేపట్లో తెరవేయించి ఊరుకోవడమో, అశరీరు ణ్ణిచేసి కంఠధ్వని పరోక్షంనించి వినపడేటట్టు చెయ్యడమో అవలంబిస్తే, కొంతవరకు పరిహాసం కట్టచ్చు

శాస్త్రి—నాటకం అంటే విలాసం, వినోదం. 'వేషం' అం టూ పెట్టి ఏమిటీ ఊహాంగామా?

. సన—ఆగుడు. సెకురా త్వరలో ముగింపుదు.

బల—నాటకం వినోదమే, నాటకంరాస్తే గొప్ప. చూస్తే తమాషాయే. కానివేస్తే ఏచం అని కొందరి వాదన. అనవసరపు అల్పాగ్రజ్ఞనే సామాన్యంగా పెట్టుకుని సాధారణ ఆంధ్రన టుడు ఎందునా బొందనివాడు అయాడు. నీచమైనా పెద్దవాళ్ళు వేషాలు వేశారుగదా! రాముడు వనంలో వేషం. సీత అగ్నిసాక్షి వేషం రావణుడు సన్యాసివేషం, పాండవులు విరాటరాజుఇంటో వేషం. సతి పార్వతివేషం పార్వతిపెళ్ళికి అచ్చరలవేషం. విష్ణువు మత్స్యకూర్మాదివేషాలు. కృష్ణుడే వేషం. పైగా ఆ కృష్ణుడి మాయవేషాలు అనంతం, అని వింటాం.

వేషంచూడ్డం విలాసంకావచ్చు, వినోదంకావచ్చు, వేషం

వెయ్యడం అంతకంటె ఎక్కువ దే. ఒకొక్క వేషం సజీవంగా ముందు వ్రాసినవాడిచేతా, తరవాత వేసినవాడిచేతా ఒప్పించ బడితే, అదినిజంగా మహోత్కృష్ణం. అట్టివేషం ఒక్కొక్కటి నూరుగురి మనుష్యుల స్వభావలేశాల్ని లోపల ఇముడ్చుగుని ఉంటుంది. ఆవేషంవంటివాడు ఏ ఒక్కడూ ప్రకృతిలో దొరక్క పోవచ్చుగాని, ప్రకృతిలోవంటి మానవుల లక్షణాలు ఆవేషంలో చాలాదొరుకుతాయి. అట్టివేషాలుగల ఒక్క నాటకంతో చాలామంది మనుష్యుల్ని మనం గ్రహిస్తాం. అట్లాంటి నాటకాలు చాలా చూస్తే మనకి ప్రపంచంలో మానవుల ఆనందాలూ క్షోభలూ వేడుకగా బోధపడతాయి—ఎదటజరుగుతూన్నది అబ ద్ధంఅవడం చేత వేడుక, మన మనస్సుకి నాటడం వల్ల బోధ. అన గా. ఒక్క జన్మలో అనేకజన్మల వృత్తాంతాలు మనికి తెలుస్తాయి. అట్టినాటకాలుచాలా వ్రాస్తే, ఎన్నామనం ఈజన్మలోనే అనేక ఇతరజన్మలు ఎత్తినట్టు: అట్టినాటకాలు చాలా వేస్తే,మనస్సుతో నేకాకుండా శరీరతః కూడా అనేక ఇతరజన్మలు మనం ఎత్తవలిసి రావడంవల్ల మరీజన్మసాఫల్యం. తన వేషం తనభాషా తనసర్వాం వదలడంలో మమకారం విడిచి, తనే కనపించకపోడంలో అహం కారం చంపేసుగుని, రాజూ మంత్రీ బంటూ లాంటివేషం ఏ కే నా సరే వేసి సర్వభూతసమత్వాం స్థాపించి, తనే ఒక కల్పితపాత్ర అవస్థగురించి ఏడిచి నవ్వి ముత్తుగోడంలో ఆత్మవత్ సర్వభూ తాని ఋజువుచేసి, తన నాశనంవల్ల ఏదోకల్పితపాత్రకి జీవం పోయ్యగల త్యాగి నటుడే! అదే మానవ జీవిత పరమావధి

ఈ రహస్యంలోనే మానవుల నాటకప్రీతికి కారణంకూడా ఉంది. హృద్దేశంలో వేంచేసి, చరాచరాల్లో నిండి, నాటకం ఆడిస్తు న్నాడో ఆడుతున్నాడోగాని, ఆ దివ్యనటుడు అందర్నీ రక్షించు నుగాక! నమస్కారం.

శాస్త్రి—అయితే ప్రతీనాటకవువాడూ ఇంతే?

బల—ఆ, సంగతి తెలిసిన ప్రతీవాడూ!

శాస్త్రి—అయ్యా! అధ్యక్షులవారు! రెండుముక్కలు నా డొక్కలో నున్నవి. అవిక్కడ కక్కెద. లెక్కకు మిక్కిలివై, బంగరక్కరములతో చెక్కుట కిక్కలై, పిక్కు టక్కుటిక్కులు గలిగి, మిక్కుటమైన మక్కువ గలిగి, చక్కని చక్కెరముక్క లును, అక్కడక్కడ ఉక్కుచెక్కులవంటియు ...

సవ—అయ్యా! చాలును. దిక్కులు పిక్కటిల్లుచున్నవి.

శాస్త్రి—వేరు దిక్కుల కొన్ని డొక్క వాలికలుచేయు నవియు ...

భావ—మహాప్రభో! ఆగండి! టూ రనేమా టేమిటి?

శాస్త్రి—నాకల్లాంటి గొప్పప్రమాణాలు ఉన్నాయి. అయిన ఇప్పుడు చెప్పింది శుద్ధశోత.

సవ—మీరు అంతటితో ఆగుడీ! ఇంకను మాటాడెడివారు న్నవారా? ఎవరును లేరని యనుకొనెద. తరువాతవిషయము— 'అగ్రాసనాధిపతి— అంత్యోపన్యాసము'

[కొంచెం దగ్గి, గొంతిక ఝూడించి సులోచనాలు ముక్కు మీదకి తీసి]

సభ్యులారా ; చాలా కాలాతీతమైనది. ప్రప్రథమమున మీకు నేను చేసియున్న వాగ్దానము నుపసంహారము చేసివైచికొనవలసి వచ్చుచున్నది గదా యని బిట్టువగచెద. జరిగినదాని లోని సారస్యము ను గ్రహించుకొంటకై, యద్దానిని మీకే వీడెద. ఉపన్యాసకులు గోరంతలు కొండంతలు చేసినారు. అసలు ఇది తగాదాయేకాదు. గ్రహింపవలయునుగాని, ఏదియు తగాదా కాదు. ఉచితనాటకము చక్కగ వ్రాసి, ఉచితనటులు రమ్యముగ నద్దానిని జదివి, ఉచితవేషములు సుందరముగ ధరించి, ఉచిత రంగముపై లీలగ నెక్కి, ఉచితాభినయమును రమణీయముగ నెరపి, ఉచితరాగ మద్దానితో కోమలముగ మేళవించి, ఉచిత రస ముప్పతిల్లచేయునెడ, ఉచితముగ నుండునని నా సముచితాభిప్రాయము. సభ ఇంతటితో నరి.

[అని కూచుని సోడా తాగుతాడు. అంతా చప్పట్లు కొడతారు.]

భావ—అప్పుడు మేం అంతా ఉచితంగా విని ఉచితంగా చూస్తాం.

కార్య—ఆర్యులారా! నేటి కార్యక్రమం ఇంత జయప్రదంగా జరిపి, ఇంత ఉచితంగా ముగింపజేసిన శ్రీ శ్రీ నవరసరావుగారికిన్నీ, నేడు ఉపన్యసించిన బలవంతరావుగారికిన్నీ శ్రమకోర్చి దయచేసిన సభ్యులకున్నూ, అనేక శతసహస్ర వందనాలు. నమస్కారం.

సమాప్తము.

# తుక్కు-ముక్కల హక్కు-చిక్కు

మా నవరసపురంలోకల్లా మా సమాజం నమోనాజ్ఞానదీపం. దీల్లో అల్పు లుండరని తెలయడానికి దీన్ని అతీతాంధ్ర సమాజం అన్నారు. ఇందులో ప్రతీసభ్యుడూ విద్యలో అయితేను, లేక అవిద్యలో అయితేను, ఉద్దండుడే. నిర్వాహకవర్గంలో పదవీలకోసం తొమ్మండుగురునే ఉంచారు. వీళ్ళంతా పిడుగులే. అధ్యక్షుడూ, ఉపాధ్యక్షుడూ, అతిజన, మహాజన, తర్జన, భర్జన, గోరోజన, నిరంజనులూ-అన్నట్టు నేనూనూ! తమదగ్గిర అర్ధం ఎందుకు, కార్యదర్శిని నేనే! మంత్రిత్వం నాదే-చెప్పకపోడమే! అయ్యో! మాతొమ్మండుగుర్నీ నవనిధులన్నా, నవగ్రహాలన్నా కుడా లోపమే గాని పాపంలేదు, ఏమనుకున్నారో! విలాసం, వినోదం, కాలక్షేపం, ఆటలూ, ఆరగింపూ, భోగమూ ఇవిమాత్రం వినయపూర్వకంగా సమాజాదర్శాలుగా పెట్టుగుని, ఇవి సాధించుకోడంలో అవుతూండే ఖర్చుకి ఎంతమాత్రమూ వెనుతియ్యని యథాశక్తిస్వార్థత్యాగంచేస్తూ, చుట్టుపట్ల ఉండే ఆంధ్రమూర్ఖుల్ని (మా సమాజంలో సభ్యులు కానటువంటి ఏ కొన్ని రకాలో తప్ప తక్కిన అందర్నీ అన్నమాట !) జ్ఞానవంతుల్నిగా చెయ్యడానికి అంతా కంకణం కడితేగాని లాభం ఉండదని ఉరమగలవాళ్ళచేత ఉపన్యాసా లిప్పించడంలో మా దేశసేవ ప్రకటించుకుంటూ, మేం తంటాలు పడుతూంటాము. గతించిన వార్షికోత్సవానికి సమావేశం

జరపడానికి మేంజేసిన ఆలోచనా, పడ్డపాట్లూ, అష్టాల్ని స మ్మానం చెయ్యడానికి (—ఇది సమ్మానయుగం అన్నారు పెద్దలు !) మేం వెచ్చించిన బుద్ధీ 'జయప్రదం' గా (అనగా మ రోళ్ళకీ ఇంకోళ్ళకీ జయం ప్రసాదించే రకంగా) సమావేశం జరిగిన వార్త ప్రకటన చెయ్యడంలో మేం పడ్డ జాగర్తా. అయినాసరే చివరకి మాకొచ్చిన నిష్టూర్యమూ, ఈ సంగతులు కొంచెం మన విచేస్తాను ! గమనించి న్యాయం విచారించండి పుణ్యానికి పోతే పాపం ఎదురవడం అన్నా, డబ్బెట్టి తద్దినం కొనుక్కోడంఅన్నా ఏడిచిపోతాడని అనర్హుడికి చేసిన సత్కారణం తస్కారణంగా పరిణమించడమన్నా, ఇదవునో కాదో చిత్తగించండి !

వార్షికోత్సవదినం వారంరోజు లుందనగా ప్రణాళికాలోచన గురించి వాహకులం సమావేశంజాయినాం. తర్జనభర్జనలుతప్ప తక్కిన ఏమాగురూ హాజరయ్యాగు. అధ్యక్షుడే కుర్చీ'తీసుకు న్నారు.' దీర్ఘచర్చ నడిచింది. ప్రతీ తఖిసీలూ సమగ్రంగా తల పోశాం. శక్తిసామర్థ్యమూ కొలచుగున్నాం. పీలూ సాలూ గుర్తించుగున్నాం. అగమ్యాలకీ అసాధ్యాలకీ నీళ్లు వొదులు కున్నాం.

అ—వార్షికోత్సవం వచ్చేఆదివారం వీలేమో !

గో—అసలు వచ్చే శుక్రవారం గావునుగా, ఆ రోజే. పెట్టండి.

నే—శుక్రవారం అయితే అంతా రారు - బహిరంగసభకి !

గో—అంతా ఎవరూ ? అసలు బహిరంగసభ ఎందుకూ.

అని నా ప్రశ్న.

ఉ—సరిసరి. మన సంస్థ వెల్లడి నిమిత్తం సభ చేసుగోవద్దూ! ఘోషణ అనేది ఈ రోజుల్లో ఎంతేనా అవసరం. ఘోషణ వల్లే పోషణజరగడం!

మ—మనకి ఘోషణ ఎందుకూ?

ఉ—మనం చేస్తూండే దేశసేవ మూర్ఖజనానికికూడా బోధ పడగలందులకు.

గో—మన పస్లవల్ల తెలుస్తానే ఉంటుంది కదా?

అ—నిశ్చయంగా! ఆ పస్లన్ని తిన్నగా తెలియనివాళ్ళలో కూడా ప్రచారంచేసి ప్రచలనం కలిగిస్తే ప్రశస్తం కదా!

గో—తెలిసేటట్టు ఒక్క డప్పు వెయిస్తే చాలేమో, టూకీగా వదుల్తుంది!

అ—డప్పు మరీ కఠోరంగా ఉంటుంది. బహిరంగసభే నా జూకురకమైన డప్పు.

ని—జనానికోసం చేసినపన్లు జనానికి తెలియకుండా ఎల్లాఉంటాయీ? డప్పు ఏమనీ?

అ—అబ్బ, కొన్నికొన్ని ఉండవచ్చునండీ! అల్లా అంటారేమిటీ! మనం అంతా ఈ సమాజం ఉద్యోగపదవుల్లో ఉండడమూ, వ్యవహారిస్తూండడమూ ఇదంతా ప్రజాబాహుళ్యంలో ప్రకటన కావడం అనేది మనకి ఉత్తరోత్తరా శ్రేయస్కరం అవునంటారా? కాదంటారా?

ని—అయితేకావచ్చు కాని మనం జనానికి చేసిందేముందీ?

అ—ఈ దార్ని వెళ్లే గొప్పగొప్ప వక్తల్ని, కవుల్ని ఆపి, గంభీరోపన్యాసా లిప్పించలేవా, కావ్యపఠనాలు చెయించలేవా!

ని—ఇప్పించాం, చెయించాం! మనం చేసిందేముందీ?

అ—ఓయి వెర్రివాడా, అప్పుడు మన పేరు ఎంతమందికి తెలిసిందయ్యా మనీ! మన యాజమాన్యంకింద అవన్నీ జరగనివ్వడంలో మనం ఎంత ఔదార్యం కనపరిచామో, చూడవేమయ్యా? మన ఆసరా లేకపోతే ఉపన్యాసపు ముక్కలూ పద్యం ముక్కలూ ఎవ్వడేనా మూచూస్తాడా? అయ్యా బహిరంగసభ తప్పకుండా ఉండాలి. ఓటుకి పెట్టమంటారా?

ని—అవసరం లేదంటూన్నది నే నొక్కణ్ణేగా! ఓటెందుకూ? మీదే జయం.

అ—ఇది స్థిరపడ్డది గనక, మరి అధ్యక్షుడు ఎవరూ అనేది ఆలోచించు దాం. ఆంగ్లభాషలో ఉన్న "పలితకేశాల్ని మన్నన చెయ్యవలెను" అనే సామెతని బట్టి, ఒకసారి ఒక తాతగా. పిలిచాం ఆయన మన్ని గురించి వణుకుతూ ఒకటోరకంగా సాగిస్తా, జనం వినుపించుకోక గోలగానే ఉండిపోయారు. మనకి పదేనా విరాళం ఇవ్వకపోతాడా అనుకుని మరోసారి ఒకధనికుణ్ని అధ్యక్షుడుగా తెస్తే అతగాడు ప్రసంగాంత్యప్పుకూడా మనదగ్గిర వసూలు చేసుకుపోయాడేగాని గవ్వేనా మనకి రాల్చలేదు. ఇంకోసారి, ఎదురుకోలు సన్నాహానికి రెండుమూడు వందలుకూడా తగలేసి, ఒక మహాధికార్ని పిలవగా, వాడు మన సమాజానికి సెంటు భూమేనా రుద్రభూముల పక్కనేనా మంజూరుచెయ్యలేదు.

వేరే ఒకసారి, ఒక పండితుణ్ణి పిలవగా, ఆ ఘటం మన్నీ ఊర్కే కలియగట్టి హడలతిట్టి, ఎవణ్ణీ నోరెత్తకుండా నొక్కేసి, చక్కా పోయాడాయిరి. అందుకని, మనం ఈ విషయం బాగా ఆలోచించాలి.

ని—అన్ని అధ్యక్షలక్షణాలూ మీలోనే ఉన్నాయిగనక, మీరే అంతరంగంలో ఉన్నట్టే బహిరంగంలో కూడా అధ్యక్షుడుగా ఉండరాదూ ఆ పూటా ?

అ—మీరు ఇష్టులుగనక అల్లా అన్నారు. కాని బాగుంటుందా మరీ ! లోకానికి వెరవద్దూ ?

ని—మూర్ఖలోకానికి జ్ఞానబృందం వెరవవలసిన పనేమిటీ?

గో—పోనీ, మన సమావేశ అధ్యక్షపదవికి ప్రజ్ఞలూ,బిరుదులూ, యోగ్యతాపత్రాలూ గుదిగుచ్చి అభ్యర్థుల్ని దరఖాస్తులు పంపుకోమంటే బాగుంటుంది. చిన్న దరఖాస్తుఫీజు కూడా పెట్టచ్చు.

అ—మీరు వికటంగా మాట్లాడకండి.

గో—నేనట్లా మాట్లాడవలిసిన పరిస్థితులు మీరు కల్పించకండి- క్షమించి !

ఇ—ఇప్పుడు విషయం ఏమిటంటే, బహిరంగసభాధ్యక్షుణ్ణిగా ఎవర్ని పిలిస్తే మనకి లాభమూ అని ?

గో—అదేనండి నేచెబుతూన్న దీనూ !

నే—నాదొక మనవి. మన్ని ఏకకుండా, ఉభయముఖప్పులూ అతడేపెట్టుగుని, గొప్ప ప్రభుత్వోద్యోగంలో వెనకి ఉండం

చేత ఘాటుగా విమర్శించడం మానుకుని, ఇప్పుడు విరమణంలో ఉన్నవారిని వెతికి, రాసి ఒప్పించి, మీతో చెబుతాను. పేరు వొదిలిపెట్టి తీర్మానం రాయండి.

అ—సరి. మరి కార్యక్రమం నిర్ణయిద్దాం.

మ—సమావేశానికి 'ఓపెనరు' కూడా ఉండద్దూ?

అ—అంత అవసరం లేదండి.

మ—అదేమిటండీ అల్లా సెలవిస్తారూ! 'ఓపెనరు' మామూలు సోడాబుడ్డికే అవసరం అయినప్పుడు, సమావేశానికి అవసరం కాకపోవడమేమిటీ!

అ—ఈ మధ్య అదో ఫాషన్ అయినా, లేకుండాకూడా బోలెడు సభలు జరిగాయి. మీరు ఊరుకుందురూ! అధ్యక్షుడు దొరకడమే దుర్ఘటం అవుతూంటే, మరో ఘటంకూడా దొరకుతాడు ఓపెనరుగా!

మ—అల్లాఅయితే సరే, పోనీ కొట్టెయ్యండి, ఎల్లానో అల్లా!

అ—ఉహూ కార్యక్రమానికేనా ఏమిటండీ! నిరుటి కార్యక్రమం దగ్గిర పెట్టుకోవడమున్నూ, అప్పటిఅసందర్భ ప్రమేయాలు ఏమన్నా ఉంటే విసర్జించి తాజావి ఏమన్నా అవసరంఅయితే తగిలించి గ్రంథం నడపడమున్నూ.

ఇంతలో అర్జెంటుగా "నలుగురు రాజుల" దగ్గిర్నించి అధ్యక్షుడికి ఆహ్వానం రాగా ఆయనా, సంభాషణలో ఎన్నడూ పాల్గొనక కాఫీమాత్రం గొంటూండే అతిజనుడూ వెళ్ళిపోయారు. తక్కినవాళ్ళయిదుగురం ఉన్నాం. 'కోరం' రెండే! చాలా

త్వరగా సభాకార్యక్రమాలు నెరవేర్చడానికి 'కోరం' ఒకటిగా ఉంటేనే సరి అనేటువంటి తీర్మానం ఒకటి గోకించడానికి మొదట పట్టుపడదాం అనుకుని, అధ్యక్షుడు తను అనవసరం అయిపోయానని ఇదవుతాడేమో అని మళ్ళీ అనుకుని ప్రతిపాదన సంహరించుకుని 'కోరం' రెండుగా లోగడ నిర్ణయింపించాను. అధ్యక్షుడు వెళ్ళిపోడంతోటే ఉపాధ్యక్షుడు కుర్చీ అలంకరించాడు —ఇంత మొహంచేసుకుని !

ఉ—సరే. గబగబా కానీండి. మొదట ప్రార్థన. 'జన గణమన......'

ని—తెలుగువాళ్ళ ప్రార్థనగా మరోటి ఉంటే నయమేమో!

గో—చాలా ఉన్నాయి. ఉంటేం, తెలుగువాళ్ళందరికీ భరించేది తెలుగుతో నిమిత్తంలేనిదే అనే సిద్ధాంతం మనం మరిచి పోకూడదు.

ఉ—గోపిస్తూ, కనుక్కుంటేదిగా, అదే కానిత్తాం. అయినదానికీ కానిదానికీ మాట్లాడకూ ?

ని—పోనీ, ఎక్కడేనా అందులో 'ఆంధ్ర' రానీండి. వ్యక్తుల్నిబట్టిగదా సంఘం !

నే—అబ్బ! సంఘంకోసం వ్యక్తి పోతేమండీ ? అదీకాక, పాడేవాళ్ళకి ఇప్పుడు కొత్తఅలవాటు ఎల్లా అవుతుందీ ! బాగా పాడితే ముక్కలు ఎవ్వైతేం ?

ఉ—అది సరే. అల్లానే ఉంచుదాం. తరవాత అధ్యక్షు ప్రారంభోపన్యాసం. సరే. పిదప కార్యదర్శి నివేదిక.

నే—సరే, తయారుచేస్తాను.

ని—తెలుగులో నేనాండి ?

నే—సరిసరి. మనం తెలుగువాళ్ళమని అమోఘని సంగా ఉండడానికోసమేనా అది ఆంగ్లంలో ఉండడం కర్తవ్యం కదండీ! అప్పుడుగాని నివేదికకి తగ్గ దర్జా, తగ్గ గాంభీర్యమూ ఉండవ్ - అని మీరే అంటారు రేపు.

ని—మూర్ఖజనానికి తెలియద్దూ !

నే—ఒక్ఖముక్క తెలియకూడదు.

ని—మరి సభ ఎందుకూ ?

నే—ఇందులో ఏదో ఉందిగోయ్ అని మూర్ఖులు భయపడేటట్టు భాష ఉన్నప్పుడే మూర్ఖులు దణ్ణంపెట్టి ఒప్పొగునేది, తెలుసా ! అందుకని, ఇంగ్లీషుని వేదిక ప్రశస్తం. సంస్కృత నివేదిక కుడా పనిజరుగుతుందిగాని ఇప్పుడు కష్టం. తేట తెలుగుని మూడు ముక్కల్లో సంగతి ఇదీ అని చెప్పండి. 'చీత్, ఇదట్రా'' అంటాడు సభ కొచ్చిన ప్రతిమూర్ఖుడూనూ !

ని—అయితే మనసంగతి వెల్లడవడం ఎల్లా ?

నే—మన సంగతియొక్క వయినాలు వెల్లడవవుకాని మన సంగతి ఏదో గభీరమైంది ఉందని వెలడవుతుందిగా !

ని—చిత్తం. మీయిష్టం. నివేదిక యావత్తూ పదహేను నిమిషాల్లో అయిపోతుందా !

నే—ఇంగ్లీషులో పది నిముషాలే చాలు— నా ఇంగ్లీషు తమకి చెప్పాలా !

ని—తరవాత సభ ముగియచ్చుగా, మరేముంటుందీ!

నే—ముగియచ్చు. కాని కార్యక్రమం ఇంతే అయితే జనం దండిగా రారు. అసలే రారేమో!

ని—అనేక అనవసర జనం ఎందుకూ రావడం? ఇష్టులు వస్తారు. చాలదా?

నే—బహిరంగ సభ అని పేరెట్టినా, అంతరంగికులు మాత్రమే అక్కడికి వచ్చి, ఆ వచ్చిన వాళ్ళుకూడా చెప్పాల్లో కాళ్ళెట్టుగుని కూచుంటే, అధ్యక్షుడు నీళ్ళుకారిపోతాడు, సభ 'జయప్రదం'గా అయిందని పత్రికకి పంపడానికేనా వీలుండదు.

మ—ఏదో ఆకర్షణ ఉంటేగాని అంతా రారు. బాలాదిగా అంతా వస్తేనే శోభ. లేకపోతే ధాగుదుమూచ్చి లాడినట్టుంటుంది.

ని—'అందరూ విచ్చేయ ప్రార్థితులు' అందాం.

మ—అన్నా సరే రారు. వచ్చిన వాళ్ళుకూడా, అధ్యక్షుడు ఎల్లాఉంటాడో చూసేసి, పలుపుల్లో కట్టిపెట్టినా సరే అక్కుండా తెంపగుని పారిపోతారు.

ని—'జనం' అంటే మీ ఉద్దేశం ఏమిటీ?

నే—ఉద్యోగులూ, ఆంగ్లోపాసకులూ, విద్యార్థులూ, విద్యార్థినులూ, పిల్లలూ తల్లులూ, కుంకుమమ్మలూ బోడెమ్మలూ వీరూ బస్తీలలో సభాజనం! ఆంగ్లశబ్దాన్యాలు విస్తారం పల్లెలలో శోద్ధించూడొచ్చే జనం!

ని—వీరందరినీ మన భవనాచరణలోకి ఆకర్షించే నిమిత్తం మనకి నిమిత్తంలే కార్యక్రమం ఇంకా ఉండాలంటారా ?

నే—ముఖ్యంగా ఉండాలి !

ని—మన వ్యవహారాలు చూసుకోడానికి మన బాధ్యతలు ఎంతవరకూ నిర్వహించామో నివేదించడానికీ వీరందర్నీ పోగు చెయ్యడం ఎందుకూ ? పెద్దలు నలుగురు చాలరూ ?

నే—మీకు ఆంధ్రాభిమానం లేనట్టుందే ! అడ్డంగా వాదిస్తున్నారూ ?

ఉ—కొన్నికొన్ని ఆకర్షణాలు ఉండాలండీ నిరంజనం గారూ ! మీరూ రెంగరులెండి. సంకర్షణ్ణించీ అల్లావే వస్తోంది. వాదన క్రియ తెలిసినంతమాత్రాన్ని ప్రతిదాన్లోనూ వాదనకి చొరపడడమేనా ! తగ్గండి.

గో—అల్పాహారం పెట్టించండి. అంతావస్తారు.

ఉ—ఇదా తమ సలహా ! వేరే అడగక్కర్లేదు.

నే—చందావసూళ్ళు నిత్యఖర్చుకి చాలక ఛస్తున్నాం. మూకజనానికి అల్పాహారాలు కుడానా ?

గో—అయితే తమరే సెలవివ్వండి.

గో—దిగ్దంతుల్లాంటి శాస్త్రపండితు లున్నారు. వార్ని సశరీరంగా రమ్మని పిలిపించి జనానికి బోధ చెయించండి.

నే—అంతమందిలో బోధ ఎల్లాగండీ ? ఒక మూర్ఖుణ్ని కూచోపెట్టి బోధించేటప్పుడే గురువు చెవుల్తెంపి చేతులో పెడతాడుగదా, సలక్షైమందిని కూచోపెట్టి బోధ చెయ్యడం

చూస్తున్నాంగదా, ఒకేక్షణంలో మహాప్రజకి బోధచెయ్యడం ఎలా ? బోధనవాసన కొట్టగానే వక్తని దిగు దిగు అని లేవడీ కొడతారు.

గో—అయినా సరే సమర్థుల్ని తెచ్చి బలవంతాన్ని ఉపన్యాసాలు చెప్పించి మూర్ఖసభ్యుల అజ్ఞానం పోగొట్టి దేశంయొక్క, అనగా నగరంయొక్క, అనగా ఆసభయొక్క సాధారణ జ్ఞానపుమట్టం లేవగొట్టాలి. ఉపన్యసించేవాడు వేదికమీంచి దిక్కుపోతే సరీ !

నే—దిక్కుపోతే మోసేస్తారు.

సి—పోనీ, మరి ఇతర ఆకర్షణాలు ఏమిటీ ? మీఊహా కళలా?

నే—అవును. లలిత కళ లున్నాయి. కాని వాటిల్లో చెవికి తగిలే కళలు మాత్రమే సభకి మరీ తాజా !

గో—మన తర్జనభర్జన సోదరుల గానం పెట్టించండి.

నే—వాళ్ళ గాలిపాట సభకి చాల్తుందా ?

గో—చాలకపోతే చందా వెయిద్దాం.

నే—అది కాదయ్యా ! వీళ్ళపాట సామాన్యప్పాట ! అది తెగ ఎరుగుదురు గనక సభ్యులు ఆ గానం మెచ్చకపోతే ?

గో—పోలీసుల్ని కాపలా వేసి, మెచ్చుగునేటట్టు లాటీలతో తాళం వెయింతాం.

నే—జనం లేచిపోతే ?

గో—ఆవరణ గోడ దాటి వెళ్ళిపోడానికి అణా అణా

టిక్కెట్టు పెడదాం.

నే—ఇంతే మీ సలహాలు.

ని—గాత్రపాటా, యంత్రమా మీ రనేది?

నే—యంత్రమయేది గాత్రమయేది లోగడ ఎంతో కొంత పొందిసి ఆకర్షించి ఉన్నవాడు— ఎంతో మొహమాటం ఉంటే గాని ఊరకే రాడు. ఉల్సాగా వస్తేగాని మనకి 'జయప్రదం' కాదు. పోనీ వొత్తిపుణ్యానికే వచ్చి పాడేవాళ్ళని ఒప్పగుందాం అంటే, అప్పుడుకూడా మద్దెల ఫిడేళ్ళలాంటి పరికరాలకి బోలె డివ్వాలి; వచ్చిన జనానికందరికీ 'క్లోరోఫారం' ఇవ్వాలి.

సి—అయితే ఈ మధ్య భరతనాట్యం ఊరేగుతోంది, పెట్టించండి.

నే—అందునిమిత్తంకూడా ఖర్చు తప్పదు. అదీ కుదరదండీ!

గో—ఏదీ కుదరకపోతే, ఎందుకయ్యా నీ కీ కార్యదర్శిత్వం? శ్రమ మరోళ్ళదీ పేరు నీదీనా? ఏ ఖర్చూ కూడదూ? నీసొమ్ము కాదే. సంఘావసరమైన ప్రజ్ఞ గల వ్యక్తిని సంఘం పోషించక పోవడం అట్లా ఉండగా, ఆ ప్రజ్ఞ నేర్చినందుకు శాస్తిగా త్యాగంకూడా వాడే చెయ్యాలనా ఆ రెండూ లేనివాళ్ళ వాదన!

నే—కార్యదర్శికష్టాలు తెలుసుగుని మరీ మాట్లాడండి. మీరు కానీ పసూలు ఇవ్వలేదు సరికదా, . . .

గో—చిత్తం చిత్తం. తమరు అప్రస్తుతాలు రానీకండి. చాలామట్టుకి వెళుతుంది.

ఉ—స్వామీ, అసలుసంగతి చూడండి. నాకు అర్జెంటు పనుంది. పోతాను.

గో—నాకు అర్జెంటుపని ఎంతమాత్రం లేకున్నా, నేనూ పోతాను. మొదట కాఫీ పట్టుకోను. తరవాత సేకూ జారుకోను.

(అని వాళ్ళిద్దరూ వెళ్ళిపోయారు. మహాజనకముగారూ, నిరం జనం గారూ, నేనూ మిగిలాం.)

నే—ఏమయ్యోయ్, మీరేనా ఉండి ఈసాప్తీకార్యక్రమ నిర్ణయం తుదనెగ్గించాలి.

మ—పోనీ మనవాళ్ళచేత ఏదేనా నాటకం ఆడించండి, జనం విరగబడివస్తారు.

ని—నిజమేనండీ. మనం విద్యావంతులంగనక, చక్కటి సంస్కృతనాటకం కట్టించండి. బరువుకి బరువూ ఉంటుంది, ప్రతిష్టకి ప్రతిష్టా ఉంటుంది, ఆనందానికి ఆనందమూ ఉంటుంది, ఒకవేళ మన యత్నం పాడై ప్రదర్శనం ఎంతో ఏడిసినట్టున్నా నరే 'శాకుంతలం' లాంటిది ఆడా లంటాను. చావు తప్పనప్పుడు సరియైనవాడి చేతులో చావమన్నాడు.

నే—నిజమేగాని, మనకి మాటలు తెలియద్దూ, నోరు పెగలద్దూ ?

మ—అందుకని, అభినయం ఎక్కువచేసేసి, మాటలు బాషా తగ్గించేసి, ఆ కాసినీ తెలుగు లిపిలో రాసేనుగుంటే! మూణ్ణిమిషాల్లో ఆడచ్చు ?

నే—ఆడచ్చు. మీరు దుష్యంతుడు వేస్తారా?

మ—బాబో, అదేమిటండోయి, నేను మాఅమ్మాకి ఒక్కణ్ణే కొడుకునిగుడాను.

నే—సంస్కృతనాటకాలు రెండుకూడు హృద్యంగా ఉండేవి ఉన్నా అసలు క్లైం లేదండీ! విన్నారా! అదే అసలు ఇబ్బంది. అదోటీనూ, ఇంతా తంటాలుపడి మనం చివరదాకా ఆడినా, నూటికి తొయ్యిమందికి అది తెలియదు.

ని—అయితే, మనం ఇంగ్లీషువాళ్ళం గనక ఆంగ్ల నాటకం కడితే, చుట్టుపక్కల్నించి ఆంగ్లేయులుకూడా వస్తారేమో!

నే—హాయిగా వస్తాగ్గండి. వచ్చి మరి వెళ్ళరుకూడానూ! కాని మనకి మాతృభాషాభిమానం లేదని ఎవరేనా అనుకోగల్రు గనక ఇంగ్లీషు మనం మానాలి. సత్తా లేక కాదు, టకటకలాడించెయ్యగలం! తెలుసుగోలేనివాళ్ళుకూడా మెచ్చుగుని మరీ పోతారు.

ని—మన కెవరికీ హిందీకూడా రాదుగనక, పోనీ, తెలుగు నాటకం ఎదేనా తియ్యండి, మరి గత్యంతరం లేదు.

నే—అదే నాకు తోస్తోంది. ఒక వెయ్యి తెలుగునాటకాలున్నాయికాని నాబోటిగాడు వేషం వేద్దాంఅంటే మంచిది ఒకటీ లేదండీ.

ని—పోనీ ఒక్ఖ ఆదర్శనాటకం మీరు రాసిపారేసి, తయారుచేసిపారేసి, ఆడేసిపారేసి, ఊరుకోకూడదూ?

నే—నిమిషం. నేను నాటకం పుర్రకాల్తో రాసేస్తాను. కాని

యుద్ధం మూలాన్ని సందేహిస్తున్నాను.

మ—అదే చిక్కొచ్చిందండి. పోనీ రాయొద్దు. పాతది ఏదేనా తియ్యండి. పద్యాలూ రాగాలూ లేకపోతే ఆ నాటకాన్ని తం వచెయ్యాలి, చూసి మరీ తియ్యండి. మీరు పాడగల్రుగా అ స్నట్టూ!

నే—పాడతానుగానండీ, కళాదృష్టితో పాడతాను, వినే వాళ్లు కళాయిదృష్టితో విని, మన్ని వృత్తినటుల్తో పోల్చి, తేలిక చేసి చెప్పులు గిరవటేస్తారు.

ని—ఒఖ్ఖనాటికి గిరవటెయ్యరు. ఇప్పుడు చెప్పులు చాలా ఖరీదు. తెలుసునా?

మ—అయితే మన సభ్యు లింకేమందున్నారు ఒఖ్ఖ రాగ నాటకమేనా ఆడలేరుటండీ! రాగనాటకం లేకపోతే జనం ఛస్తే రారు. సుప్రసిద్ధ రాగనటుల్ని వచ్చి, ఉచితంగా, ఒక్క అరగంట, ఏదేనా ఆడిపొండన్రా అంటే రారూ?

నే—వస్తారు. మీరు ఎన్ని వందలు ఇస్తారు పెట్టుబడికి?

మ—నేను ఉచితం అన్నాను.

నే—నేనూ అంతే అంటున్నాను. వందలు రాకపోకల ఖర్చుల నిమిత్తంమాత్రమే! ఆడేది ఉచితంగానే!

ని—పోనీ వచననాటకం ఆడిచూస్తేనండీ!

నే—తద్దినంలా ఉంటుంది.

ని—అందుకనే! వార్షికం అన్నా, తద్దినమేగా!

నే—ఇన్ని కళలు తెలిసినవాళ్ళం, మనం వచననాటకం సు

తరాముా ఆడకూడదు, మన పవిత్రసమాజంగడ్డమీద అటు వంటి పని జరగనియ్యకూడదు. తెలుగు వచనమ్మోహానికి నాటకం ఏమిటండీ, బోడిక్కి పిగ్గలాగా!

మ—పోనీ ఏదేనా పొట్టినాటకం ఆడితే!

నే—మనం అంతా పొడుగేగా! పైగా, జనం ఇంకా పొడుగు ఎగిరితే గాని పొట్టినాటకం అందుకోలేరు. పొట్టినాటకాని కిప్పటి జనం బలాదూర్!

ని—కార్యదర్శీ! నువ్వే సమర్థుడవయ్యా! ఏదో కార్యక్రమం చూడు. జనాన్ని ఆకర్షించడానికి ఏవేనా ఉపన్యాసాలు పెట్టిస్తే!

నే—పెట్టించావచ్చు, పద్యాలు చదివించావచ్చు.

మ—వెనక వీష్వానారాయణరావుర్పుంటివి ఉండేవి, అటువంటి ఫార్సు ఏదేనా ఆడిస్తే! ముతగరకంఫార్సులు లక్ష ఉంటాయి వెధవ్వి!

నే—నే చెప్తాను వినండి. ఉపన్యాసమూ, కావ్యపఠనమూ ఫార్సూ—ఈ మూడూకుడా మాటలతో పన్లే అనగా విలువ శూన్యంగా గలవి, గనక మనకి ఖర్చు లేనివి. దేశంలో ఉపన్యాసకులు రకరకా లున్నారు. శూన్యవిషయంమీద ప్రసంగించేవాళ్ళూ, నియమితవిషయం పుచ్చుగుని అది తప్ప తక్కిన, లోకమంతా ముచ్చటించేవాళ్ళూ, విషయం నిమిత్తమాత్రంగా పెట్టుగుని స్వంతదస్తరం విప్పేవాళ్ళూ, తమరు చెప్పే గొప్పవిషయాన్ని స్వీకరించిన సభని చూసి కోపగించేవాళ్ళూ—ఇల్లాగా.

వీళ్ళలో అనుభవం అయినవాళ్లు రైలుఖర్చులు ముందు పంపిస్తే గాని రారు. తెలివిలేని కార్యదర్శులు అల్లా చేస్తూంటారు. నేను అల్లాంటి పని చెయ్యను.

ని—మరి?

నే—"నీవంటివాడు ఆంధ్రంలోనూ, భూమిమీద కూడా లేడూ! నీ ఉపన్యాసం మా ఊరిదాకా ప్రవహించింది. మేం అందులోనే స్నానం రోజూనూ! నువ్వు వచ్చేదాకా ఈ ఊరంతా ఉపోష్యాలుంటారు. పాపం మాటకట్టుకోకు!" అని అతడిమీద కవిత్వం చెబుతూ రాస్తాను. వచ్చేస్తాడు.

ని—వచ్చి ఖర్చుసొమ్ముకి పేచీ పెడితే?

నే—పెట్టడు. వాడూ చదువుకున్న ఆసామీ కదా! మనంత బరితెగి వీథిని పడతాడా? లోపల ఏడుచుగుంటూ, పని చేసి పోతాడు. ఒకవేళ నోరుచెడి అడిగినాగానీ "ఉత్తరంలో రైలుఖర్చు ఇస్తామని ఉందిటయ్యా! బుద్ధిలేదుటయ్యా నీకూ? ఈమాత్రం త్యాగం లేందే ఎవడిక్కావాలయ్యా నీ చవటోపన్యాసం. ప్రజ్ఞ నీకు ఉందని నువ్వు కనిపెట్టడంతోటే సంఘం నిమిత్తం అది ధారపొయ్యద్దుటయ్యా! నే చెప్పినతరువాతేనా నేర్చుగోనచ్చునే స్వార్థత్యాగమూ!" అని మనం కొంచెం జోరు చేస్తిమా, నోరు మూసుగుని రోడ్డుచ్చుగుంటాడు. వాణ్ని మరి పిలవం. ఇల్లా పడగొట్టగా వందలాది మైళ్లనించి నేను మొత్త మొత్తటి ఉపన్యాసకుల్ని మన సమాజానికి తోలుకొచ్చింది! కాని, యిప్పుడు, గట్టివాళ్ళు ఖర్చులు లేందే వచ్చి చేతిచమురు

భాగోతం కట్టరు.—అనగా ఉపన్యాసం కక్కరు.

ని—సరే. ఎవర్ని స్థిరపరుస్తారూ!

నే—నాదృష్టిలో ఇద్దరున్నారు. వాళ్ళిద్దరుకూడా కొత్తగిత్తలే. ఒకడు ఖండాంతర పరిశ్రమలగురించీ, రెండోవాడు లోకాంతర కవిత్వం గురించీ 'గంభీరోపన్యాసాలు' 'జన్మప్రసంగా' ఇస్తామని ఊటలూరుతున్నారు. వాళ్ళకి ఛాన్సు ఇద్దాం.

ని—సరి. కావ్యపఠనం?

నే—ఒకతను రాత్రివచ్చాడు. తొమ్మిదణాలకాడికి బేరం స్థిరపడచ్చు.

ని—తొమ్మిదణాలు ఏమిటి?

నే—అతని పద్యాలు పావుగంటసేపు మన బహిరంగ సభలో అతనే చదవడానికి మనం తేకుణాం ఇస్తే, ఆంగ్లకవి ఒకడన్నట్టు, మొన్నాడు మన సమాజానికి అర్ధరూపాయి బహుమతీ ఇస్తానన్నాడు.

ని—మీరేమన్నారు?

నే—తొమ్మిదణాలు ఇమ్మన్నాను.

ని—ఎందుకూ?

నే—నిర్వాహకసభ్యుల్లో ఒక్కొక్కడికి ఒకఅణా తేలిగ్గా పంచడానికి వీలునిమిత్తం. అతడు ఒప్పుకున్నాడు.

మ—ఇంకా ఎవర్నైనా అల్లాంటి పద్యకర్తల్ని తనతో తీసుకురమ్మనండి. పోనీ ఆరేటుచొప్పునే సన్మానిద్దాం, వాళ్ళని కూడా!

ని—అతను పాడతాడా?

నే—ఆ. కాని ఆ పాట వినపడ్డంత మేర గ్రహబాధలు తొలగుతాయి అని భయం!

ని—అయితే పద్యసారస్యం యథాతథ్తా ఒక్క దెబ్బకి జనానికి తెలుస్తుం దంటారా?

నే—తెలియదు. అందుకనే, అటువంటివే, ఆంధ్ర మహాజనం మెచ్చడం అని చెప్పానుకదండీ. ఈ మహాజనానికి అల్లా మెచ్చడం అలవాటైపోయింది.

ని—అదేం ధర్మం? అటువంటి అభిరుచా మనం జనంలో కలిగించవలసింది?

నే—ఇందే అభిరుచేమిటీ—ముందు వొత్తిరుచి. అనగా తెలియకుండానే మెచ్చడం. అది నవీనమైన ఒక ఆంధ్రకళ!

ని—తెలుసుకునికూడా మెచ్చుగుంటారేమో! అప్పారుసాని మెప్పేమిటీ!

నే—తెలుసుగునా? సాధారణసభ్యుణ్ణి ఎవణ్ణేనా దెక్కట్టుగుని "ఏమిటి ఈ పద్యతాత్పర్యం" అని కనుక్కోండి. "నాయిష్టం నువ్వెవడివ్, కనుక్కోడానికి!" అంటూ కొప్పడతాడో లేదో! సభలో అల్లా అడగరుగదా అని ప్రతివాడికీ ధైర్యం. 'ఓహో' అంటే తీరిపోతుందని మెచ్చుగుంటున్నారట, డెబ్బలా ఉందుకని— నేను చాలామందిని తరవాత కనుక్కుంటే చెప్పారు.

ని—తేః భోజనం పెట్టేవాడు భోక్తల ఎదటికి స్వయంగా వచ్చి 'పదార్థాలు' ఎట్లా ఉన్నాయండీ అంటే, "దివ్య చకోరం

గా ఉన్నాయి, స్వర్గతుల్యంగా ఉన్నాయి, ఫస్టుక్లాసుగా ఉన్నా యి'' అంటూ రేగాని, తింటూ మరోమోస్తరుగా మాట్లాడతా రా? అదే ప్రాటకూళ్ళ నీండి—అనగా టిక్కెట్టు పెట్టండి, అప్పు డు యజమాని అడగా అడగకుండు, అడక్కపోయినా భోక్తలు ఊరుకోరు!

మ—అబ్బ! చాలా ఆలస్యం అవుతోంది. దిక్కుమాలి ప్ర హసనం ఏదేనా ఓటి ఆక్షేపిస్తూ, అక్కడితో సభ విరగడై పోతుం ది, తీరిపోతుంది!

ని—ప్రహసనం నీచం కదా! అందులో పాషండులూ చో రులూ పాత్ర లుండాలిగావునే! అప్పుడుగాని నవ్వు వస్తుందా మరీ? ఏమన్నా, కార్యదర్శీ!

నే—మీకు చెప్పేది 'సంస్కృత' ప్రహసనంగావును! అ ది కాదుగా ఇప్పుడూ!

మ—ఏమైతేం, నవ్వు వచ్చేది ప్రతీదీ నీచమే అంటాను! మీరు ప్రహసనాల్లో వేషం వేశారుగా! మీరే అభ్యర్థి పేటి లో చెప్పండి.

నే—చిత్తం. నేనన్నమాటేమిటి, అర్థమైనవాళ్ళు ప్రహస నంలో వెయ్యొచ్చునండి. నీచత్వానికి తయారీ ఏం కావాలీ?

ని—అంత వీలా?

నే—అవునండి. ఇందులో పాట అవసరంలేదు, కవిత్వంలేదు, తాళంలేదు, మేళంలేదు, వేషంలేదు, పార్టు రానక్కర్లేదు.

ని—అదేమిటీ! మరెల్లా?

నే—పద్యాలైతే మనం మధ్యమధ్య ముక్క సర్దలేంగాని, ప్రహసనంలో మన స్వంతముక్కలూ స్వంతకైత్వమూ, మనం హాస్యం అనుకున్న వికారచేష్టలూ తిట్లూ, సంబోధనలూ కలిపేసి మాటలసంపుటీ అప్పటిదో, పూర్వంఘదో తెలియకుండా మొత్తంమీద పనిచెయ్యడానికి అవకాశాలున్నాయి. ప్రతీచోటికి కర్తభస్త్రాడా! ప్రహసనం పట్టించింబా, మనదే ప్రయోజకత్వం. పోయిందా, కర్తని తిట్టిస్తాం.

మ—ఎవడేనా ప్రహసనం రాయడంలోటే నీచుడు. సత్తా ఉంటే గొప్పవేమన్నా రాయాలిగాని, అశ్లీలపు తుక్కుముక్కలు పోగుచెయ్యడానికి తుంటరి ఎవడైనా సరిపోతాడు.

ని—అల్లాంటి ముక్కలన్నీ కంఠతా పట్టి రెండుమూడు సార్లు మన కార్యదర్శిగారే వేషం వేశారుట, ఆట్టే తిట్టకండి. వీరు అంతకంటె నీచులని అర్థం అవుతుంది.

నే—ఎంతమాత్రం కాదు. నేను ఆకర్తతో చెప్పకుండా గుప్తదానం మంచిదిగనక, అతని ప్రహసనాల్లో వేసింతరవాత కర్తముక్కలయొక్క నీచత్వం పోయి, నామూలాన్ని గౌరవం హెచ్చింది ఆముక్కలకి.

ని—కదందిక్కు ఏదీ లేకపోడంవల్ల జనాన్ని ఆకర్షించడానికి మనం ,ప్రహసనం, తీసుగుంటున్నాంగనక, మరి యాగీ మాని, ఆ ప్రయత్నం ఏదో చెయ్యండి. జనానికి గానమేనా ఉండాలి, హాస్యమేనా ఉండాలి. సార్వత్రికమైనవి మరి ఆట్టే లేవు.

నే—గానానికి డబ్బు పోయ్యలేం. ఇక—సూలి హాస్యానికి పోయ్యగొడవ లేదు. మనంత విద్యాధికులం గనక్క చేపట్టడమే దాని జన్మకి మహాదశ! మనం ఇస్తున్న గౌరవమే దానికి వెయ్యి వేలు.

ము—సరే. కొంచెం ఉపన్యాసాలూ, కావ్య రసపానా, ఒక నీచపు హాస్యా—ఇవన్నమాట జనాన్ని ఆకర్షించడానికి మనం పర్ణయించుకున్న శబ్దకళలు.

నే—చిత్రం.

ము—మరి సెలవ్. కార్యక్రమం పూర్తి చేసి, అధ్యక్షుడికి పంపి ఇవ్వండి.

నే—సరే. అప్పుడేనా. అధ్యక్షుడి మాట తేల్చుకుని మరీ యిస్తాను.

[తరవాతనించి కంగారు యావత్తూ నాదే అయింది. అల్పాహారాల ఏర్పాటు, డిన్నర్ ఖంజాయింపు, సభలో కూర్చోడానికి కట్టుదిట్టాలు, అధ్యక్షుడి ఒసగురించీ, ఆశ్రయించిన కవుల్నీ ఉపన్యాసకుల్నీ ప్రణాళికలో జొనపడాన్ని గురించి తంటాలు—ఇల్లాంటివన్నీ నామీదే నిల్చిపోయాయి. ఇవన్నీ ఓ యెత్తూ, ఆ మాయధారిపహాసనం ఓ యెత్తూ అయింది. నేనందులో వెయ్యాక తప్పిందికాదు. ఆడవేషానికి మొగాడు కుదరక స్త్రీవచ్చే ప్రహసనం మానుకుని అయిదారు వేషా లుండే ఓ తుక్కుప్రహసనం తీశాం. మా బృందాన్ని కే కేశాం. నామనట్టు, నటయోగి, హాస్యార్ణవం, హాస్యవానరం, నవు రేడు మొదలైనవాళ్లని. వీళ్లకి

నాకూగుడాఫార్సులో ఉండగల తుక్కుముక్కలతో లెక్కలేదు. నా మహాత్యం వల్ల జనం నవ్వేస్తారు. నామనట్టు హాస్యకర్త రాసిన వంకరమాటలకి తిరిమిణిపట్టి నుసుపుచేసి నవ్వించే జీనియస్ కాని, పాట్లు రాదు, చెప్పలేదు, చేతకాదు. నటయోగిదియావత్తూ ఇంగ్లీషునవ్వులు, అతను పల్లెటూళ్లనవ్వులూ పత్రలనవ్వులూ పడి ఫార్సులుక్కలు మాట్టాడుగుని కప్పలూమెడలూ లాగే వాడు. హాస్యార్ణవం ఎప్పుడూ ఇవతలకూడా నవ్వించే మాటలు చెబుతాడుగనక, అతనికి పార్టే అక్కర్లేదు. హాస్యవానరం మొహంకేసి చూస్తే వొర్తప్పుడుకూడా నవ్వుతూన్నట్టు కనిపించడం వల్లనున్నూ, అతనికి కోపం వచ్చేటట్టు మనం తిట్టినప్పుడు అతడికి మరీ నవ్వుమొహం పుట్టడంచేతనున్నూ, అతణ్ణి తెగతిట్టడానికి ఒక మనిషిని పెడితే చాలు అతడి దంతా నవ్వే. నవురేసు ఎంత మాత్రం గానం రానివాడవడంచేత, హాస్యానికి నిధి అని పేరు పొందాడు. ఇంకా ఇవతల నిత్యకృత్యంలో బూతులు మాట్లాడేవాళ్లనీ, తోరణాలు తెంపేవాళ్లనీ మేం అవసరాన్ని బట్టి ఉపయోగించుగోడానికి నియమించుగుని, ఎంతమంది కూడితే అంతమందితో రిహార్సల్సు వేస్తూ, పేలవంగా ఉన్నట్టు మాకు తోచినచోట్ల మాటలు లాగేస్తూ చాలాశ్రమపడ్డాం! నాకు వీలైనప్పుడల్లావెళ్ళి నేను మా అధ్యక్షుడితో పరిస్థితి చెబుతూండే వాణ్ణే గాని, మా కార్యనిర్వాహక వర్గం మళ్లీకలియలేదు. కార్యక్రమం వెయించేశాను. లండన్ దిగుమతీ అయినడాక్టర్ అఖండ్ గారు అధ్యక్షుడు, ఎ. బి. ఘన్, సి. డి. ఖర్‌లు ఉపన్యాసకులు,

సహాయకభిషదకవిగారి కా వ్యవహరనం, చివరకి ఫలానా ఫార్సు అని మాత్రం రాశాం-ఆపేరుతో ఏదైనా సరే ఆడెయ్యొచ్చునని.]

వార్షికంరోజు వచ్చింది. 'జయప్రదంగా' జరిగిపోయింది. జనం చాలామంది వచ్చారు. చోటు చాల్లేదు. అబ్బో! స్త్రీలూ వచ్చారు, నాటకాలు పోయాయికాదూ! ఇక్కడ మేం తేరగా ఆడేవాళ్లం దొరకాంగా! మొదట కార్యక్రమం మునుగుమునుగుగా ఉందిగాని, క్రమేపీ తెరిపిచ్చింది. ప్రహసనం రాకుండానే సవ్వుతోచ్చారు. అసందర్భాలు జరిగినప్పుడు నవ్వేశారని మా అయిష్టులు అంటారుకాని, రాబోయే ప్రహసనాన్ని తల్చుగుని అని నేనంటాను. నాకు ఓ మెడలిచ్చారు. వద్దంటే విన్నారు. కారు. నటయోగికి నామీద కోపం వచ్చింది. నామనట్టు ఉరెట్టుగుంటానన్నాడు. అయినాసరే నాకు మెడల్ ఇచ్చారు. మొర్నాడు ఒక మహారాజు ఈ ప్రహసనంలో అశ్లీలాలున్నాయి, మర్యాదస్తులువినచ్చునే గాని ఆడకూడదన్నాడు. అశ్లీలాలెక్కడ అని అడిగాం. అంతటా అన్నాడు. నమస్కరించాం. తనురాలేదు, అల్లాఅని విన్నానన్నాడు. కొన్నిచోట్ల చప్పగా ఉందని మా మేలుకోరేవారన్నారు. హాస్యకర్తముక్కలవే అని మేం అనేశాం. కొన్నిచోట్ల జోరుగా ఉందన్నారు. ఆ స్థలాలన్నీ మా స్వరచనే అని చెప్పేశాం. తరవాతరోజు పత్రికలో డాక్టర్ అఖండ్‌గారి అధ్యక్షతకింద మా సమాజవార్షిక సభ 'జయప్రదంగా, జరిగిందని పడింది. అంతటితో అయిందనుకున్నాను. ఒక్కొక్కటిచొప్పునే వస్తూండే బిల్లులు చెల్లించుగుని బయటపడడం

ఎల్లానా అని చూస్తూండగా, ఒక ఉత్తరం వచ్చి, నా మనశ్శాంతి అంతా పాడు చేసింది. నానా శ్రమలూ పడి, మేం, పోనీ అని జాలి పడి ఓ పార్కు ప్రదర్శించాం అన్నానే. ఆ కర్త దగ్గర్నించి! తన పార్కుట, తనకే పాక్కుంటెట, ఇంతోటి పాక్కు తనతో చెప్ప కుండా పబ్లిగ్గా అది ఆడి మేం భంగపరిచామట, మాది నేరంట! మొదట్నించీ అనుకుంటూనే ఉన్నాను. ఆ పార్కు అసలు తుక్కు రకం. కడం వాళ్ళు పట్టిస్తారు గాని, లేకపోతే, అంత నాసిరకం నేను తలపెట్టను. ఏ తనుంది పార్కుగాళ్ళు నాకాళ్ళమీద పడ్డారూ తమని ఆడమనీ! వాళ్ళ పేరు నిలిచేటందుకు వాళ్ళవి మానేసి' నాకు నచ్చినవాళ్ళవి వాళ్ళతో చెప్పేదేమిటని ఆడేసి- ఈరీతిగా రచయితల్ని అందర్నీ నిత్యముగౌరవిస్తూనే ఉంటాను. వీడి కేంవచ్చిందో! ఈ మాటు కార్యక్రమంలో వెయ్యకుండా పబ్లిగ్గా ఆడిస్తాను, ఎవడు చూడొచ్చాడూ వీడివి ఆడద్దని ప్రచారం చేస్తాను. దూరపు ఊళ్ళల్లో ఆడొస్తారు! వెంకాలే వస్తాడా? పాండిత్యం లేని ఈ మాటలు వాడి ముత్తాతమూటట: పైగా, మేం ఏమి కావుకున్నాం చెప్పండి, ఇంకోళ్ళని ఆనందపరచడానికేకదా మేం తీసుకుంటూ, అతడికి ఇంత ఏడుపెందుకు చెప్పండీ! మేం ఏమీ లాభం పొందలేదే: నీచత్వంఅంటే ఇల్లా ఉంటుంది. కష్టపడి ఉన్నానేమో నాకు ఒళ్ళు మండి పోయింది. తక్షణం మానటబ్బం దాన్ని; మహాజనుణ్ణి కేకేశాను. అప్పుడే నిరంజనంకూడా వచ్చాడు. ఆ ఉత్తరం అందరికీ చూపించాను.

ని—ఇది చిక్కేనండీ! అతడికి రాయకపోయారా.

నే—ఇదోటా! నేను లోగడ మూడుసార్లు ఆడాను. అప్పుడు ఏమయ్యాడు వీడూ!

ని—ఆ సంగతి అతనికి తెలియదేమో!

నామ—నేను బోలెడుచోట్ల వాక్యాలు దిద్ది వాటికి మెరుగు పెట్టి అందులో ప కోశాన్నీ స్ఫురించని హాస్యచేష్టలు చేసి, చచ్చి చెడి జవాన్ని నవ్వించాను. అంత శ్రమా పడితే నాది నేరమూ? వీడా అల్లా అనడం!

నట—నేను ఇదే ఆడి మెడల్సుకూడా పుచ్చుకున్నాను. ఇల్లా అని తెలిస్తే ఈ దిక్కుమాలి ముక్కలం కంతతా పట్టుక పోదునే? ఛీ, జిహ్వా కాల్చింపుగుంటూ!

ని—తొందరపడకు. ఎక్కడని కాలిపిస్తావ్! నీపెదివి మొదలు గుండెవరకూ ఆ దిక్కుమాలిన ముక్కలు వ్యాపించిఉన్నాయి.

నట—ఏడిశాయి.

చే—ఆ రచన అతనిదిట.

నట—ఏడిసింది! ఇందులో ప్రతిమూక్కా చెత్తరకపు నిఘంటువులోకుడా ఉంది. రచన వాడిదేమిటి?

నామ—చాలామాటలు నిఘంటువులోకుడా లేవు. కుళ్ళిపోయిన పాతఫక్కీ బజారు సరుకు. అధముడుకుడా ఇంతకంటె అరింటాగా రాయచ్చు.

నామ—నే నల్లాంటి ఫార్సులు యాభై రాస్తాను ఎడంచేత్తో.

నట—నేను రాసి ఎవళ్లకీ చూపించను, లాగేస్తారు.

నామ—అసలు ఇతర ప్రహసనాలు లక్ష ఉన్నాయి. ఇదే

ఫార్సు, బోడిఫార్సు !

ని—అల్లాంటప్పుడు, ఈ చవటమాటల ఫార్సే దిక్కుగా మీరెందుకు బయల్దేరారయ్యా ?

నామ—మా వ్వంచితసంకోర్దీనూ ! వాడిపేరు కొంచెం ఈ ప్రాంతాల మూర్ఖుల్లో ప్రచారంచేసిపెడదాం, అపహోరిస్తున్నాడని.

ని—మీతో అపహారించాడా ?

నట—లేదు. మేం జాలివెయ్యగానే, ఆగలేం ! వెంటనే నత్కరిస్తాం ! మేం ఏమీ విలువ కోరళేదే ? వాడిదేగా పేరూ ?

నే—ఆ పేరు అందరికీ తెలుసునుగదా, ఇంకా వేస్తే ఓఘూయిత్వం, పైగా కాగితంకరువురోజుల్లో జాగా కుశలం అని చెప్పేసి కార్యక్రమ పత్రాల్లోకుడా అతని పేరు మేం దానియ్యందే ! జనం ఒక వేళ ఆటని తిడితే, అతడిపేరు మరుగ్గా ఉండడం మాకంటె అతడికి ఎంత నయమో తెలుసా !

ని—అతనికి మీరు మొదటే రాయవలిసింది. మనం అర్థాలమో అనర్థాలమో అతనికి తెలియద్దూ! పాడైతే?

నే—అందుకనే కాదుటయ్యా, అతని పేరు లాగేసింది ! ఎవడేనా ఆ బుక్కు చదివి వస్తాడేమో అనేభయంచొప్పునా !

ని—హాక్కు పోదులుకోమనడం న్యాయమా !

నే—ఉందని స్పష్టంగా అతడేడవ వద్దుటయ్యా! ఆమాటల అస్తి వాడిదనీ !

ని—అల్లా ఉంటుందే !

నే—లేందే !

ని—మీరు చదువుకున్న వాళ్లు గదా అని ఊరుకుని ఉంటారు. "సర్వ స్వామ్యసంకలితం" అని ఉంటుంది.

నే—ఓరి దాని మొహంమండా! దాని అర్థం ఇదా !

ని—అయిఉండాలి కొంతవరకు. నేరాలూ శిక్షలూ ఎందుకు, మీరు కృతజ్ఞత కోసం కూడా తెలియపరచవచ్చును గదా— అనుభవం గల విద్వాంసులు!! కర్త మాటలవల్ల నటువు పుడతాడు. మీరు ప్రత్యక్షం చేసే ఆనందం గురించి వినడానికి కర్త తగడా ?

నే—సరే, యిప్పు డేమిటంటారు ?

ని—మామూలుప్రకారం చేసెయ్యండి. ఊరుకోమనండి. ఖర్చులేని పనేగా !

నే—సరే మీరు రాయండి. చెప్తాను క్షమాపణ.

ని—రాస్తాను. "కర్తకు—' జమే. మీరు ఏడవవద్దు. ఏం చేస్తాం? మీకు గౌరవం తేవాలని మేం పడ్డ శ్రమకి మీరు చూపిన కృతఘ్నతవల్ల రోజులు ఎల్లాంటివి వచ్చాయో మీరు చూపించారు! ఇష్టులమీద ఎవడేనా ఈ పని చేస్తాడా? మీ యందు ఎంతఅభిమానం ఉండడంచేత మీ పేరు నోటీసులో లేకుండాచేశామో మీ కేం తెలుసూ! కొద్దివాళ్ళ పేర్లుమాత్రమే అందులో వేసి, గొప్పవాళ్ళవన్నీ తీశేశాం. అందుకని మీ పేరు దాన్లో లేదు. అదికాక, మాకు మరో దిక్కులేక మీ దిక్కుమాలిమాటలు ఆడుతున్నాం అని మొదట్లోనే మీకు రాసి ఉండవలిసిందే.

ఆరాయకుండా ఉండడానికి కూడా గొప్ప కారణం ఉంది. యథార్థం చెప్పాలంటే, మీ రచన దిక్కులేని తెలుగుభాష. పద్యమేనాకాదు, రాగమేనాకాదు, గ్రాంథికమేనాకాదు, ఉన్నతభావరహితం, పాండిత్యశూన్యం, అందరికీ తెలిసిన ముక్కలూ, వీధులో దొర్లే పడికట్లు! అందులోనూ ఎందునా బొందని, నీచం అని పెద్దలంతా ఖాయపరచిన హాస్యంతో కూడిన పాకం! ఇటువంటి రచనచేసిన మీకు మేం అనుమతి గురించి రాయడంకంటె మానేస్తేనే మీకు గర్వం తగ్గుతుందేమో అని మాకు తోచి, మీ మేలుకోసమే మీ పేరు విసర్జించాం గనక ఆ మేలు స్మరించుగుని మీరు మాకు కృతజ్ఞులై ఉండాలి. 'ఫార్సు' అంటే తుక్కుముక్కలేగదా, మీతో చెప్పే దేమిటని చాలాచోట్ల మీ ప్రదర్శనాలు ఆడుతున్నారు. నా సలహా ఏమిటంటే, మీరు ఆడడానికి వీలులేనివిగాని, ఇవి ఆడితే మనకి మాటదక్కదు రంగంమీద మరణమే అని నటులు అనుకునేవిగాని రచించండి. అల్లా చేస్తే మీకీబాధ తొలగిపోతుంది. మన్లో మనమాట మీరు రాసినవాటికన్నింటికీ కూడా ఆడడపుదోషం పట్టిందం! టూరా, అయిందేదో అయింది, అచ్చేసినవేవో అచ్చేశారు, మరి అచ్చువెయ్యకండి. మేం ఎంతోసత్కారణం అని చేసిన పనినే మీరు గొప్ప తస్కరణం అని అంటున్నారుగనక, మాట తడబడుతూన్నది మీ పేను !మేం సత్కరించక మానం.

ఇట్లు

విధేయుడు—"

ఇది నేను పుచ్చుకుని మర్నాడు కర్తకి పారేస్తానన్నా:
మేం ఎవళ్ళదార్ని వాళ్ళం వెళ్లిపోయాం. నేనా ఉత్తరం పోస్టుల
వేశానని మా వాళ్ళందరితోటీ చెప్పేశాను. చెప్పానే కాని
య్యలేదు. మంచి చెయ్యడానికి అనుమతిటవిన్నారా? చూశా
మా శ్రమకి ఫలితం? ఆనందం వృద్ధిచెయ్యడానికి మావంటి త్యా
గులు నడుంకట్టగా మాటలుగురించి పట్టింపులుపోయే అల్పుల
న్నారు. ఔరా! తుక్కోజీ ముక్కల్లో ఉందని చెప్పబడే వాక్కు
వల్ల మాకెంత చిక్కొచ్చిందో! కానీండి, మహామహావాళ్ళ
తప్పలేదు, మాకూతప్పలేదు.

[1944]

---